# మహా నాయకుడు

# మర్రి చెన్నారెడ్డి

ఈ పుస్తకాన్ని

భ్రమరాంబ సమేత

శ్రీశైల మల్లిఖార్జున

స్వామివారి పవిత్రపాదాలకు

భక్తిప్రపత్తులతో

అంకితం చేస్తున్నాను

ఆదిరాజు వెంకటేశ్వరరావు





Worshipping at Rishikesh

**మహానాయకుడు మఱ్ఱి చెన్నారెడ్డి**

**ఆదిరాజు వెంకటేశ్వరరావు**

I S B N - 81 - 900 165 - 0 - 4

*ప్రథమ ముద్రణ : 1997*

***Sole Distributors***
***Book Links Corporation***
*Narayanaguda, Hyderabad - 500 029.*
*Tele Phone : 040 - 667068*
*Res : Satyanarayana K B, Phone : 040 - 7611582*

***Distributors in New Delhi***
***D.K. Publishers And Distributors (P) Ltd.,***
*1, Ansari Road, Daryagunj,*
*New Delhi - 110 001.*
*Tele Phones : 011 - 326 1465, 011 - 327 8368*

*ఫోటో టైప్‌సెట్టింగ్ :*
మాగజైన్ నెట్‌వర్క్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్.,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్. టెలిఫోన్ : 040 - 7610706

*ప్రచురణ :*
ఓం శ్రీనివాస పబ్లికేషన్స్
F - 3. షిరిడి అపార్ట్‌మెంట్స్, రాజభవన్ రోడ్,
హైదరాబాద్ - 500 082. టెలిఫోన్ : 040 - 331 1035

***Processing :***
***Satyam Process***
*Lakdikapool, Hyderabad - 4. Phones : 233970, 241970*

***Printed by***
***Ajoy Devulapalli***
*at his* ***Joy 'n' Joy Offset Printers***
*Chapel Road, Hyderabad. Phone : 203424*

# విషయసూచిక


| | |
|---|---|
| ముందుమాట | 5 |
| మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి | 9 |
| బాల్యం ; విద్యాభ్యాసం | 17 |
| రాజకీయాలలో ప్రవేశం | 24 |
| పదవీ కిరీటాలు | 31 |
| హక్కుల కొరకు పోరాటం | 36 |
| ఆంధ్రప్రదేశ్ మంత్రి | 38 |
| కేంద్రమంత్రి పదవి | 45 |
| ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం | 49 |
| ఉత్తరప్రదేశ్ గవర్నర్ పదవి | 56 |
| ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిత్వం | 61 |
| పంజాబ్ రాజరికం | 72 |
| కాంగ్రెస్‌పార్టీకి 'తిలోదకాలు' | 80 |
| మాతృసంస్థలో పునఃప్రవేశం | 85 |
| రెండవ పర్యాయం ముఖ్యమంత్రి | 88 |
| రాష్ట్ర ముఖ్యమంత్రులలో సచ్చీలులెవరు | 93 |
| రాజస్థాన్ గవర్నర్‌గా | 95 |
| తమిళనాడుకు అపారసేవ | 98 |
| దొడ్డగుణాలు కల విశాలహృదయుడు | 106 |
| ఒక ధృవతార రాలిపోయింది | 122 |
| గ్రంథ రచయిత మనవి | 125 |

# ముందు మాట

పొత్తూరి వెంకటేశ్వరరావు

డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారు నిజంగా మహాపురుషుడు. త్యాగాలు చేయడం అవసరమైనప్పుడు త్యాగాలు చేశారు. భోగాలు అనుభవించే అవకాశాలు ఉన్నప్పుడు అందుకు వెనుకాడలేదు. అలా ఆయన త్యాగపురుషుడూ, భోగపురుషుడూ కూడా. ఆంధ్రప్రదేశ్ చరిత్రలో చెన్నారెడ్డిగారికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. చరిత్ర ఉన్నంత కాలం ఆయన పేరు నిలుస్తుంది.

భారతీయ విశ్వాసాలపట్ల సాంస్కృతిక సంపదపట్ల డాక్టరుగారికి అపారమైన గౌరవం. తన దైవభక్తిని, జ్యోతిష, వాస్తు తదితర శాస్త్రాలపట్ల అభిమానాన్ని బాహాటంగానే ప్రకటించేవారు. నిస్సందేహంగా ఆయనకు దైవానుగ్రహం ఉంది. కనుకనే కోరినవీ, కోరనివీ ఎన్నో అవకాశాలు ఆయనకు వచ్చాయి.

చెన్నారెడ్డిగారు స్నేహానికి ప్రాణమిస్తామనేవారు, వైరాన్ని కోరితే ప్రాణం తీస్తారనేంత భయం కలిగించేవారు. ఆయన మిత్రవర్గంలో అన్ని ప్రాంతాలవారు ఉన్నారు. అన్ని మతాలవారు, కులాలవారూ ఉన్నారు. స్నేహానికి అంతరాలనెప్పుడూ అవరోధం కానీయని సహృదయుడాయన.

ప్రత్యేక తెలంగాణాను కోరినప్పటికీ చెన్నారెడ్డిగారు మొత్తం రాష్ట్రాభివృద్ధిని ఆకాంక్షించారు. అభివృద్ధి పథకాలను గురించి చర్చ వస్తే ఆయనలో ఎక్కడలేని ఉత్సాహం పొంగేది. అభివృద్ధి ప్రతిపాదనలను ముందుకు తీసుకొనిపోవడంలో ఆయన చొరవ, పట్టుదల అసాధారణమైనవి. ఫైళ్లను చూడడంలో ఆయన వేగం అధికారులను ఆశ్చర్యచకితులను చేస్తుండేది. ఫైళ్ల "ఆయువుపట్టు"లను తెలుసుకోవడంలో ఆయనకు ఏదో ఒక అలౌకిక ప్రతిభ ఉన్నదనిపిస్తుంది.

యాభై సంవత్సరాలకు పూర్వం తెలుగువారు చాలామంది మద్రాసును "చెన్నపట్నం" అనేవారు. తమిళులు సైతం "చెన్నైపట్నం" అంటూండేవారు. అలాంటి చెన్నపట్నం రాజధానిగానున్న తమిళనాడుకు "రాజ్యపాలకుడు"గా చెన్నారెడ్డిగారు తనువు చాలించడం విధివిలాసంగాక మరేమనుకొందాము! అంతేకాదు, చెన్నారెడ్డిగారు రాజ్యపాలకుడుగా ఉన్నప్పుడు ముఖ్యమంత్రి కరుణానిధి పట్టుదల పూని మద్రాసు నగరం పేరును అధికారికంగా "చెన్నై" అని మార్పించడం ఎంత విచిత్రం! దైవంపట్ల విశ్వాసం లేనివారు సైతం ఆశ్చర్యపడక తప్పని అపూర్వ సంఘటన ఇది!

నమ్ముతారో లేదో- ఆదిరాజు వెంకటేశ్వరరావుగారు అక్షరాలా మూడంటే మూడే రోజులలో ఈ పుస్తకం రాశారు. 'ఎత్తిన కలాన్ని' దించకుండా, 'వంచిన నడుం' ఎత్తకుండా ఏకబిగిన రచన సాగిపోయిందంటే అతిశయోక్తి అనిపించవచ్చు. అది ఆయన దీక్ష. అదే ఆయన దక్షత.

ఆదిరాజు వెంకటేశ్వరరావుగారు నాకు దగ్గర స్నేహితుడు. ఐనా, ఇంత వేగంగా పుస్తకాన్ని పూర్తి చేయడం నాకే ఆశ్చర్యం కలిగించింది. ఆయనా, నేనూ కూడా డాక్టర్ చెన్నారెడ్డిగారిని అభిమానించినవాళ్లమే. మేము కలసి వెళ్లినప్పుడు డాక్టరుగారు మమ్మల్ని "వెంకటేశ్వర ద్వయం" అనేవారు. అనేకసార్లు ముగ్గురం ఆత్మీయంగా కబుర్లాడుకొన్న తీపి జ్ఞాపకాలే ఇప్పుడు మిగిలాయి.

డాక్టరుగారి మరణం అనాయాసం, ఆకస్మికం. "పుణ్యాత్ములకే అనాయాస మరణం" అంటారు. అదేమోగాని హఠాత్తుగా మనమధ్యనుండి ఒకరు శాశ్వితంగా కనుమరుగైపోతే బాధ కలగక తప్పదు. అలా బాధపడిన ఆదిరాజు వెంకటేశ్వరరావుగారు పుస్తకం రాసి ఊరట చెందారు. ఇప్పుడున్న జర్నలిస్టులలో చెన్నారెడ్డిని గురించి బాగా తెలిసిన వారు చెన్నారెడ్డి అభిమానం బాగా పొందినవారు ఆదిరాజు వెంకటేశ్వరరావుగారే. డాక్టరుగారి మరణానంతర కర్మకాండ ముగిసేలోగా ఎంత చిన్నదైనా ఒక పుస్తకం రాసి, తద్వారా జోహార్లు అర్పిద్దామనుకొని, అనుకొన్నట్టే పూర్తి చేశారు. మరింత సమగ్రంగా పుస్తకం రాయాలన్న ఆయన సంకల్పం కూడా త్వరలోనే పూర్తికాగలదన్న విశ్వాసం నాకు ఉంది.

ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ సమాన ప్రతిభతో రాయగలిగిన ఆంధ్ర జర్నలిస్టులు బహుకొద్దిమంది. అందులో ఒకరు ఆదిరాజు వెంకటేశ్వరరావు గారు. ప్రత్యేక తెలంగాణా కోసం ఉద్యమం జరిగిన 1968-69 ప్రాంతంలో అగ్రనాయకులతోపాటు జైలు శిక్షను

అనుభవించిన ఆదిరాజుగారు జర్నలిస్టుగానే కొనసాగారుగాని, రాజకీయాలలోకి మళ్లలేదు. కోరుకొంటే అది ఆయనకు ఉన్నత పదవులను అందించి ఉండేదేమో. ఆంధ్ర నాయకులెందరెందరితోనో సన్నిహిత స్నేహం ఉన్నట్టే జాతీయ నాయకులెందరితోనో ఆయనకు పరిచయాలూ స్నేహాలు ఉన్నాయి. రాజీవ్‌గాంధీ, పి.వి.నరసింహారావు గారిలాంటి వారిపై ప్రామాణికమైన చరిత్ర గ్రంథాలు రాశారు. రాష్ట్ర రాజకీయాలను గురించి శ్రీమతి ఇందిరాగాంధీ, జైల్‌సింగ్‌లాంటి నాయకులు స్వయంగా ఆదిరాజుగారితో చర్చించడం నాకు తెలుసు. ఇంతటి ఉన్నతులతో సాన్నిహిత్యం ఉన్నప్పటికీ దానిని సొమ్ము చేసుకోవడానికి ప్రయత్నించకపోవడం ఆదిరాజు వెంకటేశ్వరరావుగారి నిజాయితీ.

"మహా నాయకుడు మర్రి చెన్నారెడ్డి'లో అతిశయోక్తులుగాని, అపసవ్యాలుగాని లేవు. వక్రోక్తులు అంతకంటే లేవు. సత్యనిష్ఠతో సాగిన రచన ఇది. అక్కడక్కడ నిర్మొహమాటంగా రాసిన పంక్తులు కొన్ని కనిపిస్తాయి. వాటి వెనుక అభిమానమేగాని మరొక ఉద్దేశం లేదని "ఉభయ" మిత్రుడనైన నాకు తెలుసు.

చెన్నారెడ్డిగారి అసంఖ్యాక మిత్రులకు, అభిమానులకు ఈ పుస్తకం నచ్చుతుందని, ప్రజలు ఈ "అపూర్వ" జీవిత చరిత్రను అభిమానిస్తారని నా విశ్వాసం.

డిసెంబర్ 13, 1996



# I. మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

హిందూమతస్తులు ఆరాధించే ముక్కోటి దేవుళ్లలో ఆదిదైవం శంకరుడు అని ప్రతీతి. ఆ స్వామి సహస్రనామాలలో హరి, శంభు, హరిహర, మహేశ్వర, పరమేశ్వరలతోపాటు శివనామం భక్తులచే అధికంగా ఉచ్ఛరించబడుతుంటాయి. భోళాశంకురుని అనేక ఆకారాలలో ఆయన లింగాకారం, నందివాహనం శిరస్సుపై గంగాధారియైన పరమేశ్వరుడినే, మణికంతుడినే భక్తులు నిత్యం పూజిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో శివాలయాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిలో ప్రాధాన్యత పొందిన ప్రాచీన ఆలయాలు మూడు - ఇవి శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం ఆలయాలు. ఈ త్రిలింగాలు పేరనే ప్రాచీనులు తెలుగు గడ్డను 'త్రిలింగ దేశం' అని పేర్కొన్నారు. శ్రీశైలమల్లిఖార్జునస్వామి ఆలయం అతిప్రాచీనమైనదనీ, దేశంలో ఉన్న ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి ఇక్కడ విరాజిల్లుతున్నదని చరిత్ర పేర్కొంటున్నది. శ్రీశైల భ్రమరాంబదేవి కూడ అష్టాదశ ఆది శక్తులలో ఒకరని ప్రతీతి.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

ఇతిహాసకాలంలో శ్రీరామచంద్ర ప్రభువు, లంకాధీశుడు రావణబ్రహ్మతో సహా పలువురు చక్రవర్తులు రాజులు ఆదిశంకరుని ఆరాధించేవారని పురాణాలు పేర్కొంటున్నాయి. ప్రజాధిపతులు, సామాన్య మానవులు కూడ ఎందరెందరో ఈ ఆదిదేవుని నిత్యం కొలిచినా, వారిలో కొందరికే శివభక్తులు అనేపేరు లభించింది. ఇలాంటి పేరు ఉన్నవారిలో తెలుగు జాతిరత్నం డా॥ మర్రి చెన్నారెడ్డి ఒకరు. విష్ణుమూర్తి అవతారమని చెప్పబడే ఏడుకొండల వెంకటేశ్వరస్వామిని, యాదగిరి లక్ష్మీనరశింహస్వామిని, మరెన్నో ఆలయాలలో నెలకొని ఉన్న దేవతామూర్తులను కూడ డా॥ చెన్నారెడ్డి భక్తిశ్రద్ధలతో ఆరాధించడం అందరికీ తెలిసిన విషయమే. అయినా, ఆయనను అనేకులు శివభక్తుడని అంటారు.

రంగారెడ్డి జిల్లాలో కేసరక్షేత్రంలో ప్రాచీన రామలింగేశ్వరస్వామి ఆలయ ఉద్ధరణకు, మల్లేశ్వరం వద్ద ఉన్న మరొక ప్రాచీన ఆలయం పాము గుడికి సౌకర్యాలు కల్పించడానికీ, ఇంకెన్నో శివలయాలకు మరమ్మతు పనులకు డా॥ చెన్నారెడ్డి నడుం బిగించటం వల్లనే ఆయన శివభక్తుడు అనేపేరు వచ్చి ఉంటుంది. శివభక్తుడు అనే ముద్ర పడినందుకు శంకరుడు సైతం ఆయనను అతిగా అభిమానిస్తారా అనే అనుమానం పరిశీలకులకు కలిగే సంఘటన ఒకటి 1963లో చెన్నారెడ్డి పంచాయతీరాజ్ మంత్రిగా ఉన్న సమయంలో జరిగింది.

ఆ రోజులలో జీర్ణదశలో ఉండి ప్రజాదరణకు దూరమైన మూడు ఆలయాలు చెన్నారెడ్డి దృష్టిని ఆకర్షించాయి. కోస్తా ఆంధ్రలో నెలకొని ఉన్న ఈ గుళ్లలో మల్లేశ్వరం పాము గుడి ఒకటి. ప్రభుత్వపరంగా తప్ప ఈ ఆలయాలకు విద్యుచ్ఛక్తి సమకూర్చే అవకాశంలేదని అర్థం చేసుకున్న రెడ్డిగారు నాటి విద్యుత్ శాఖమంత్రి ఏ.సి.సుబ్బారెడ్డికి విజ్ఞప్తిచేసి ఈ ఆలయాలకు విద్యుత్ సరఫరా సమకూర్చారు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

రెండవ పర్యాయం డా॥ రెడ్డి పాముగుడిని సందర్శించిన సందర్భంలో గుడిలో శివలింగానికి చుట్టుకొని ఉన్న సర్పరాజు సరాసరి బైటకు వచ్చి చెన్నారెడ్డి తొడపై కూర్చోవటం అక్కడ ఉన్నవారికి దిగ్భ్రాంతి కలిగించినది. నిత్యం స్నానానంతరం కొంతసేపు శివలింగాన్ని పెనవేసుకొని ఉండడం ఆ సర్పానికి అలవాటు. అందువల్లనే ఆ గుడికి పాముగుడి అని ప్రచారం లభించింది.

తాము స్వగ్రామంగా ఎంచుకున్న మార్పల్లిలో రెడ్డిగారు ఆయన కుటుంబసభ్యులు సంగమేశ్వరస్వామి ఆలయ నిర్మాణం చేయించారు. కంచికామకోటి పీఠాధిపతి శంకరాచార్యులువారు ఈ ఆలయంలో శివలింగ ప్రతిష్ఠ చేశారు. ఈసందర్భంలో మూడుగంటలపాటు జరిగిన మహారుద్రాభిషేకం లో చెన్నారెడ్డిగారు ఆద్యంతం భక్తిశ్రద్ధలతో పాల్గొన్నారు.

1970 సంవత్సరం డిసెంబర్ 17వ తేదీన హైదరాబాదు నుండి డాక్టర్‌గారు ఢిల్లీ వెళ్లుతున్న ఒక ప్రయాణీకుల విమానం బేగంపేట విమానాశ్రయం నుండి గగనతలంలోకి ఎగరగానే అగ్నిగోళంగా మారింది. నిశ్చేష్టులైపోయిన చూపరులు తెప్పరిల్లు కోకమునుపే ఆ విమానం తిరిగి నేలపై వాలడం రెడ్డిగారు, ఇతర ప్రయాణీకులంతా బైటకు దూకి ప్రాణాలు రక్షించుకోవడం క్షణంలో, మెరుపులా, నమ్మశక్యం కాకుండా జరిగిపోయాయి. ఆ సంఘటన చూచినవారు నేటికీ ఇది మానవ ప్రయత్న ఫలితం కాదు దైవనిర్ణయం అంటూంటారు.

చెన్నారెడ్డి పూర్వీకులు శిరిపురం గ్రామవాసులైనప్పటికీ ఆయన అక్కడే జన్మించినప్పటికి వారిది చాలా పెద్ద కుటుంబం కావడంతో తండ్రి లక్ష్మారెడ్డి మార్పల్లిలో కొంతభూమి కొనుగోలు చేసి స్వంత వ్యవసాయం మొదలుపెట్టారు. ఆ తరువాత కాలంలో డా॥ చెన్నారెడ్డిగారు సిరిపురం గ్రామంలో తన తండ్రి వాటాగా లభించిన వ్యవసాయ భూములను గృహాన్ని దాయాదులకే వదిలివేసి

మార్పల్లే తన గ్రామంగా ఎంచుకొని అక్కడ వ్యవసాయ వ్యాపకాన్ని విస్తరింప చేసుకున్నారు.

ఆర్థికవనరులు, అధికారం లేకున్నా 61వ జన్మదినాన్ని ఆనందంగా జరుపుకున్నవారు ఎందరో మన మధ్య ఉన్నా, వివాహషష్టిపూర్తి రాజకీయ జీవన షష్టిపూర్తి జరుపుకున్న అసాధారణ వ్యక్తులు చాలా అరుదు. ఈ అసాధారణ కోవకు చెందిన పరిపూర్ణ వ్యక్తి డా॥ చెన్నారెడ్డిగారు ఒక్కరేనేమో! అసంఖ్యాక అనుయాయులు అభిమానులు "డాక్టర్ సాహెబ్" అని అప్యాయతతో సంభోదించే ఈ రాజకీయ సవ్యసాచి తన అరవై సంవత్సరాల ప్రజాజీవితంలో విశ్వవ్యాప్తంగా అనేకుల హృదయాలలో చెరగని మహోన్నత స్థానాన్ని సాధించుకొనగలిగారు.

ఆయన తన 78 సంవత్సరాల జీవితకాలంలో చేసిన మాధవసేవ, మానవసేవ ఫలితాల మేలి కలయికే విశిష్టస్థానాన్ని ఆయనకు ప్రసాదించి ఉంటుంది. కళలు, సంగీతం, సాహిత్యం పట్ల ఎంతో అభిరుచి, మెండుగా దైవభక్తికల చెన్నారెడ్డిగారు మన పవిత్ర వేదాల సారాన్నే జీర్ణించుకున్న మహా తపశ్వి, అని ఆయనను అభివర్ణించారు 'విశ్వవిఖ్యాత' ఆధ్యాత్మిక సంగీత మధురగాయిని శ్రీమతి సుబ్బలక్ష్మిగారు.

శ్రీ చిన్మయానందస్వామి డాక్టర్‌గారిని అభినందిస్తూ ఆయన నిశ్చేష్టిత వాతావరణంలో ఒక ప్రభంజనం అని అభివర్ణించారు. ప్రధాన మఠాధిపతులందరూ రెడ్డిగారికి తమ ఆశీర్వచన బలాన్ని ప్రసాదించారు. పుట్టపర్తి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా డాక్టర్‌గారికి శతసహస్ర ఆశీస్సులు తెలుపడమేకాక అభిమానించి ఆదరిస్తుంటారు. మదర్‌థెరిసా, మా ఆనందమయి కూడ రెడ్డిగారి పట్ల ఎంతో అప్యాయత అనురాగం గౌరవభావం కలిగిన వారనడం అతిశయోక్తి కాదు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

బాల్యంలో వివిధ ఉద్యమాలకు ఆధ్వర్యం వహించి నాయకత్వ లక్షణాలను సంతరించుకున్న చెన్నారెడ్డి 1950లో తాత్కాలిక పార్లమెంటు సభ్యుడై హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలోను, కేంద్ర ప్రభుత్వంలోను మంత్రి పదవి నిర్వహించి రెండు పర్యాయాలు ముఖ్యమంత్రి బాధ్యతలు నిర్వహించి, నాలుగు ప్రధాన రాష్ట్రాలకు గవర్నర్ అవగలిగారు.

మానవ మాధవ సేవల ఫలితాలతోపాటు తన గుణగణాలు కూడ ఆయనకు ఎల్లప్పుడూ శ్రీరామరక్షగా నిలిచాయి. సౌమ్యం, స్నేహశీలత, దయ, కరుణ, ఉపకారగుణాలేకాక ఎదుటివారివి వినే ఓపిక, అర్థం చేసుకున్న తరువాత ఆదరించే గుణాలు ఆయన రక్తంలో మేళవించుకున్నాయి. అయిష్టత ను, అసంతృప్తిని ఆగ్రహాన్ని ఆయన ఎట్టి పరిస్థితులలోను కప్పిపుచ్చు కొనలేదు. హృదయం సుతిమెత్తనిదై, నిర్మలమైనదైనందున ఉత్తమోక్షణ కోపశ్య అనే సూత్రాన్ని ఆయన తనకు వర్తింప చేసుకుంటాడు. అవసరమైన సందర్భాలలో రాజనీతిని పరిపాలకుడికి అవసరమైన కరకుదనాన్ని ప్రదర్శించడంలో కూడా డాక్టర్‌గారికి మరొకరుసాటి కాలేరు. నాలుగు దశాబ్దాలకు పైగా చెన్నారెడ్డి గారితో చెలిమిచేసిన సుప్రసిద్ధ సినీనటుడు అక్కినేని నాగేశ్వరరావుగారు పునర్జన్మపై నమ్మకంలేని నాస్తికుడు. అయినా, "మరొక జన్మే ఉంటే డాక్టర్ చెన్నారెడ్డి లేకుంటే అటువంటి ఉత్తముడే నాకు ఆ జన్మలో కూడా స్నేహితుడుగా లభించాలి" అని ఆకాంక్షిస్తున్నానని వ్రాసుకున్నారు.

తాను స్నేహితుడిగా భావించే వ్యక్తిని ఇతరులు ఏమన్నాసరే, సహించని వ్యక్తిత్వం డాక్టర్‌గారిది. సహాయం చేస్తాను అని చెప్పకుండా, చెయ్యరేమోనని అవతలివాళ్లు భయపడేలాగ చేసి, సహాయం చేసే గుణం చెన్నాగారిది - రాజకీయాలలో చతురత, మానవతా హృదయం ఈ రెండూ ఒక్కచోట సమ పాళ్లలో మిళితమవడం అరుదు. దానికి తోడు కార్యదీక్ష ఉత్తమ ఆశయాలు

కలిస్తే, ఇహ చెప్పాలా? అందుకే ఆయన పూర్ణపురుషుడు అంటారు అక్కినేనిగారు ఎంతో హుందాగా.

రాజకీయవ్యాపకంలో అక్షరాలు నేర్చుకొనకుండానే రాజకీయ రంగప్రవేశం చేసి అనతికాలంలోనే ప్రపంచనలు మూలల ప్రచారసాధనాలు తరచు తన పేరు ప్రస్తావించే ప్రేరణ కల్పించగలిగిన మరొక సుప్రసిద్ధ సినీనటుడు స్వర్గీయ నందమూరి తారకరామారావు రెడ్డిగారి గురించి వ్రాస్తూ "డాక్టర్ చెన్నారెడ్డిగారు దీక్ష, దక్షత, కార్యశూరతకు ప్రతిరూపం-పట్టుదలకు ప్రజాభిమానానికి సజీవస్వరూపం - సంఘ పురోగమనానికి ఆవేశం - ఆధునిక అభ్యుదయానికి మార్గ దర్శకత్వం అని పేర్కొంటూ,'ఇటువంటి సర్వోత్తమ జాతిరత్నం పరిపూర్ణ ఆయురారోగ్యవంతులై, సర్వేశ్వర కరుణా కటాక్ష లబ్ధులై, తమ ఆదర్శ సేవానిరతితో తెలుగుతల్లిని పునీతను చేయగలగాలని నా కోరిక' అన్నారు.

సినీపరిశ్రమలో మరో ధృవతార శ్రీ డి.వి.యస్.రాజుగారు చెన్నారెడ్డిగారి గురించి వ్రాస్తూ "ఆయన చాలా సూక్ష్మగ్రాహి, ఏ సమస్యనైనా ఇట్టే అవగాహన చేసుకోగల్గడమేకాక, దాని పరిష్కారం ఏ మేరకు సాధ్యమో వెంటనే తేల్చి చెప్పకలిగిన దిట్ట. సాధ్యపడే మేరకు నిర్ణయాలు తీసుకొని అమలు జరపడంలోను సాధ్యపడనివాటికి ఇతరమార్గాలు సూచించి తోడ్పడడంలోను ఆయనకు ఆయనే సాటి" అని అన్నారు.

పరమేశ్వర అనుగ్రహంవల్లనే కావచ్చు, అయాచితంగా అప్పుడప్పుడు రెడ్డిగారు భవిష్యత్తువాణిని వినిపిస్తారు. 1946లో ప్రభుత్వ వైద్యుడుగా రాజీనామా చేసిన అనంతరం తనకు రావలసిన మూడు నెలల వేతనం బకాయిపై డైరెక్టర్ మెడికల్ సర్వీసెస్‌తో ఘర్షణ పడిన చెన్నారెడ్డిగారు "నేను మంత్రిని అయిన

తరువాత పైసలతో సహా నా డబ్బు వసూలు చేసుకుంటాను" అని హెచ్చరించి వెళ్లాడు. తమ సన్నిహిత మిత్రుడు సురవరం వెంకటరెడ్డికి ఆ మర్నాడే ఈ విషయం ఆయన చెప్పారు.

"1952లో అతి పిన్నవయసులో మంత్రిపదవి చేపట్టిన "కొద్దిరోజుల తరువాత హైదరాబాదు పోవుట తటస్థించినది (రెడ్డిగారిని కలిసినప్పుడు) "నీకు రావలసిన జీతం తీసుకున్నావా" అన్నాను. 'ఎనిమిదిరోజుల క్రితమే పైసా బకాయిలేకుండా మొత్తం జీతం వసూలు చేసుకున్నాను. ఒక ఛారిటీఫండ్‌లో ఇచ్చివేశాను." అన్నారు అని సురవరం వెంకటరెడ్డిగారు పేర్కొని, చెన్నారెడ్డిని పట్టువిడవని విక్రమార్కుడుగా అభివర్ణించారు.

1977లో ఒక సందర్భంలో పోలీసులు నక్సలైట్స్ మధ్య ఎదురుకాల్పులు బూటకాలే అని ప్రస్తావనరాగా "నేను ముఖ్యమంత్రి అయిన తరువాత తీవ్రవాదులపై నిషేధం తొలిగించి శాంతియుతంగా స్వేచ్ఛగా వారు ప్రజలవద్దకు వెళ్లే అవకాశం కల్పిస్తాను" అన్నారు రెడ్డిగారు. ఆయన కొద్ది నెలల్లో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడై ఆ తరువాత ముఖ్యమంత్రి అయ్యారు. కానీ, మధ్యంతరంగా పదవినుండి వైదొలగినందున, పదేళ్ల తరువాత మళ్లీ ముఖ్యమంత్రి కాగానే తీవ్రవాద సంస్థలపై నిషేధాన్ని ఆయన తొలగించారు, ఒక పుష్కరకాలం తరువాత ఆయన తన సంకల్పాన్ని నెరవేర్చుకున్నారు. ఎంతటి పట్టుదల!!

1989లో అధికారంలో ఉండగా ఒక తెలుగు దినపత్రిక ఆయనను అతిగా పొగిడింది. అర్హతలేకున్నా ఆ పదవి పొందిన పత్రిక సంపాదకుడు అపరిమితంగా, జుగుప్సాకరంగా రెడ్డిగారి భజనచేశారు. ఒకనాడొక విలేఖరి ఆ పత్రిక ఇస్తున్న "మద్దతు" గురించి ప్రస్తావించగా, నేను అధికారంనుండి వైదొలిగిన అనంతరం ఈ పత్రిక, దాని ప్రధాన సంపాదకుడే అసందర్భంగా,

అతిగా నన్ను విమర్శిస్తారు దూషిస్తారు అని నాకు బాగా తెలుసు. నాకు వ్యతిరేకంగా అవకాశవాద మైత్రికి ప్రయత్నిస్తున్న స్వార్ధపరశక్తులు, విచ్ఛినకారులు తమ ప్రయత్నంలో సఫలం కావచ్చుననీ నాకు తెలుసు అన్నారు రెడ్డిగారు. ఆయన మాటలు అక్షరాల నిజమయ్యాయి. ఆ తరువాత, ఆ పత్రిక అతిగా జనార్ధనరెడ్డి భజన చేసి అసందర్భంగా చెన్నారెడ్డిని దూషించింది. తరువాత భాస్కరరెడ్డి భజన చేసింది. రాజకీయ జీవితంలో అత్యున్నతస్థాయికి ఎదిగిన వారికేకాక, సాధారణ నిత్యజీవితంలో కొద్దిపాటి ప్రాధాన్యతను పొందిన వారికి కూడ ప్రత్యర్ధులు, విమర్శకులు శత్రువులు ఊహాతీతంగా ఉద్భవించడం సర్వసహజం. ప్రత్యుర్ధులు లేకుంటే, ప్రాధాన్యతను పొందిన వారు మానవమాత్రులే కాజాలరు.

అందువలన చెన్నారెడ్డిగారిని విమర్శించేవారు ద్వేషించేవారు కూడ అక్కడో ఇక్కడో ఉండవచ్చు. ఎందుకంటే ఈ ప్రపంచంలో రాజకీయ జీవితాన్ని ఎంచుకొన్నవారిలో ముఖ్యంగా అగ్రనాయకులలో ఎవరూ విమర్శకులు, ప్రత్యర్ధులు, శత్రువులు లేకుండా తప్పించుకోలేదు. అయితే, చెన్నారెడ్డిగారు మాత్రం తమ పరమశత్రువులకు కూడ అపకారం జరగాలని కోరరు. అంతేకాక ప్రత్యర్ధుల కడుపుమంటకు కారణం ఏమిటో తెలుసుకొని చికిత్సకు ప్రయత్నం చేస్తారు. అదొకదొడ్డగుణం - *"సర్వేజనాసుఖినో భవంతు"* అనేది ఆయన మనస్థత్వం.

## 2. బాల్యం : విద్యాభ్యాసం

మర్రి చెన్నారెడ్డిగారు 1919 సంవత్సరం జనవరి 13వ తేదీన నాటి వికారాబాద్ తాలూకాసిరిపురం గ్రామంలో జన్మించారు. తండ్రి లక్ష్మారెడ్డి, తల్లి శంకరమ్మ. వీరు పేరు ప్రతిష్ఠలుకల మధ్యతరగతి కుటుంబీకులు. జన్మ నక్షత్రం ప్రకారం తల్లిదండ్రులు తమ సంతానానికి మొదట అచ్యుతరెడ్డి అని నామకరణం చేశారు. శంకరమ్మ తండ్రి పేరు చెన్నారెడ్డి ఆయన స్వర్గస్తులైన అనంతరం ఆమె తన తండ్రి పేరు తలుచుకుంటూ కుమారుడిని చెన్నారెడ్డి అని పిలవడంతో ఆపేరే స్థిరపడింది. శ్రీ లక్ష్మారెడ్డి దంపతులకు తొలిసంతానం తర్వాత ఒక కూతురు మాత్రమే జన్మించడంతో చెన్నారెడ్డివారి ఏకైక పుత్రుడైనారు.

క్రీ॥శ॥ 1919 చరిత్రలో విశిష్టస్థానాన్ని సంతరించుకున్న సంవత్సరాలలో ఒకటిగా అభివర్ణించవచ్చు. భారతదేశంలో పౌరహక్కుల సాధనకు కీలకమైన ప్రధమపోరాటం ఈ సంవత్సరంలోనే మొదలైనది. బ్రిటిష్ ఇండియాలో పౌర, రాజకీయ హక్కులను అణచివేసేందుకు లండన్‌లో రౌలత్‌చట్టం రూపొందగానే,

దానిని తీవ్రంగా ప్రతిఘటించేందుకు గాంధీజీ సత్యాగ్రహకార్యక్రమం ప్రకటించారు. ఉద్యమానికి స్ఫూర్తినిచ్చేందుకు ఆయన "నవజీవన్" పత్రికను కూడా స్థాపించారు. విశ్వకవి రవీంద్రుడు తమకు బ్రిటిష్ ప్రభుత్వం అంతకు పూర్వం ఇచ్చిన పురస్కారాలను ఈ సంవత్సరంలోనే త్యజించి చరిత్ర సృష్టించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవిర్భావం, ప్రముఖ శాస్త్రజ్ఞుడు విక్రమ్ సరాబాయ్ జననం, దేశంలో తొలిసారిగా ఆధునిక నౌకాయాన ప్రారంభం మొదలైన ఎన్నో ముఖ్య సంఘటనలు 1919 సంవత్సరంలోనే జరగడం విశేషం.

బాల్యంలోనే చదువుపట్ల శ్రద్ధాసక్తులు, ఆటపాటల పట్ల ఉత్సాహం చూపిన తమ కుమారుడిని ఉత్తమోత్తమమైన ఉన్నత విద్యావంతునిగా తీర్చి దిద్దాలనే సంకల్పం లక్ష్మారెడ్డి దంపతుల మనసులో చోటు చేసుకున్నది. శ్రీమతి శంకరమ్మ సోదరుడు కొండా వెంకటరంగారెడ్డి వకీలు వృత్తి చేసుకుంటూ హైదరాబాద్ నగరంలో ఉండడం వలన చెన్నారెడ్డిని విద్యాభ్యాసానికి మేనమామ వద్దకు పంపటం జరిగింది. రంగారెడ్డిగారి వద్దనే ఉన్న ఆయన సోదరుడు శ్రీ కె.వి.నారాయణ రెడ్డికూడ చెన్నారెడ్డిని పర్యవేక్షించి మంచిచెడులు చూడడంలో ఆయనకు సహకరించారు.

ఫీల్‌ఖానాలో ఉన్న తమ భవనం "శ్రీ సదన్"కు తరలివచ్చిన చెన్నారెడ్డిని రంగారెడ్డి సోదరులు వెనువెంటనే సమీపానగల ఒక బాలికల పాఠశాలలో చేర్పించగా ప్రతిపరీక్షలో ఆయన అక్కడ డబుల్ ప్రమోషన్స్ సాధించారు. బాల్యంలోనే ఎంతో మేధాశక్తితో రాణిస్తున్న చెన్నారెడ్డిని మేనమామలు ప్రతిష్ఠాత్మకమైన మెథడిస్ట్ బాయిస్ హైస్కూల్‌లో చేర్పించారు.

బాల్యం నుండి గ్రంథ పఠనం, క్రీడలపట్లనేకాక నాటకాలపై కూడ ఆసక్తి పెంచుకొన్న చెన్నారెడ్డి నటుడు అయేందుకు సమయం పట్టలేదు. వరశుల్కం అనే

నాటకంలో విమల అనే బాలికపాత్రను చక్కగా పోషించిన చెన్నారెడ్డి అందరిమన్నన పొందారు. తల్లితండ్రులు చెన్నారెడ్డి చెల్లెలకు విమల అనే పేరే పెట్టారు. విద్యార్థి దశలోనే చెన్నారెడ్డి తన సారథ్యంలో *యంగ్‌మెన్ డిబేటింగ్* అసోసియేషన్ స్థాపించి తోటి విద్యార్థులకు ఉపన్యాస పోటీలు ఏర్పాటు చేశారు. స్వంతడబ్బుతో పుస్తకాలుకొని అందరికి ఉపకరించే గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశాడు. దీనికి కారణం పరిసర వాతావరణ ప్రభావమని చెప్పకతప్పదు.

శ్రీ కె.వి.రంగారెడ్డి పేరు ప్రతిష్ఠలు, జాతీయభావాలు కల న్యాయవాది. అందువలన సమకాలీకులైన డా॥ బూర్గుల రామకృష్ణారావు, మాడపాటి హనుమంతరావు మొదలైనవారితో మంతనాలలో యువకులలో జాతీయ భావాలు పెంపొందించేందుకు గైకొనవలసిన చర్యల గురించి చర్చించడం మన చెన్నారెడ్డి గమనించి ఆకళింపుచేసుకున్నారు. ఆనాడు నైజాం ప్రభువు పరిపాలనలో పౌరహక్కులు, వాక్స్వాతంత్ర్యం లేవు. కనుక గ్రంథాలయాలను స్థాపించి వాటిని సమావేశ స్థలాలు చేసుకొని జాతీయభావాలు కలవారు అక్కడ కలుసుకొని సాంఘిక సాంస్కృతిక కార్యకలాపాల ముసుగులో రాజకీయాలు కూడ చర్చించుకొనేవారు.

మర్రి, కొండా వారి కుటుంబాలు పెద్దవి అవడంవల్ల తన వయస్సు పిల్లలు చెన్నారెడ్డిచుట్టూ ఎందరో ఉండేవారు. పైగా బంధువులు అసంఖ్యాకం. కాబట్టి గ్రంథాలయం నెలకొల్పినా *డిబేటింగ్ సంఘం* పెట్టినా చెన్నారెడ్డికి సహచరుల కొరత ఏర్పడలేదు. క్రమక్రమంగా సభ్యుల సంఖ్య పెరిగి అనంతరం డిబేటింగ్ సొసైటి రెడ్డి *యువజన సంఘంగా* రూపు సంతరించుకోగా, ఆటలపోటీలు సాంస్కృతిక కార్యకలాపాలు కూడ చేపట్టింది. కాలక్రమేణా రెడ్డి *యువజన సంఘం* బలీయమై *ఆంధ్రయువజన సమితిగా* పేరు సంతరించుకున్నది. అప్పటికే, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహణ

ముసుగులో *ఆంధ్ర మహాసభ, కన్నడ మహాసభ, మహారాష్ట్ర పరిషత్తుల* పేరుతో ఏర్పడిన *జాతీయసంస్థలు ఆంధ్రయువజన సమితి* ఆవిర్భావానికి ప్రేరణ అయ్యాయి.

1934లో మెట్రిక్యులేషన్ పరీక్ష ప్రథమశ్రేణిలో పూర్తి చేసిన చెన్నారెడ్డి, ఇంటర్మీడియెట్ చదువుతూ, 1935లో ఖమ్మం పట్టణంలో జరిగిన *ఆంధ్ర మహాసభ* సమావేశాలలో పాల్గొనేందుకు ఒక ప్రయివేట్ బస్ అద్దెకు తీసుకొని మిత్రులతో కలిసి వెళ్లారు. ఈ సమావేశాల అనంతరం చెన్నారెడ్డిలో జాతీయ భావాలు పరుగులు తీశాయి. దేశాభిమానం పెల్లుబికింది. తరువాత కొంతకాలానికి ఖాదీవస్త్రాల అమ్మకం పోటీ జరిగినప్పుడు శ్రీ చెన్నారెడ్డిగారు బట్టల మూటలు నెత్తిన పెట్టుకొని గ్రామగ్రామం తిరిగి అందరి కంటె ఎక్కువ అమ్మకాలు చేసి ప్రథమ బహుమతి సాధించారు. కార్యదీక్ష చిత్తశుద్ధి పరిశ్రమతో చెన్నారెడ్డి పెద్దల దృష్టిని ఆకర్షించగా, మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్‌లో *ఆంధ్ర మహాసభ* సమావేశాలు జరిగినప్పుడు చెన్నారెడ్డిని వాలంటీర్ల బృందం నాయకుడిని చేశారు. కేవలం హైదరాబాద్‌నగరం నుండే ఈ సభలకు 400మంది ప్రతినిధులు వెళ్లారు. వారికి స్వాగతం పలుకడం, వారి సామానులు విడిదికి తరలించడం, వారి వసతి భోజన సౌకర్యాలు చూడడం వాలంటీర్ల బాధ్యత. ఆ తరువాత జరిగిన *ఆంధ్ర మహాసభ* సమావేశాలలో చెన్నారెడ్డిగారి ప్రాధాన్యతతోపాటు బాధ్యతలు కూడ పెరిగాయి.

1936 సంవత్సరం మేనెల మూడవతేదీన చి॥సౌ॥ సావిత్రిదేవితో చెన్నారెడ్డిగారి వివాహం జరిగింది. మేనమామ కె.వి.నారాయణరెడ్డి గారి కూతురు సావిత్రి 1925 సంవత్సరం జనవరి 4వ తేదీన జన్మించారు. వివాహసమయానికి ఆమెకు 12 సంవత్సరాలు కూడ నిండలేదు. క్రితం సంవత్సరమే సావిత్రి తల్లితండ్రులు కన్నుమూసినందున పెద్ద మేనమామ కె.వి.రంగారెడ్డిగారు

కన్యాదానం చేసి ఘనంగా వివాహం జరిపించారు. చిన్నతనం నుండి బావమరదళ్లు ఒకే ఇంట్లో కలిసిమెలిసి ఆప్యాయతతో ఎదగడం వల్ల వారి మధ్య స్నేహం పెనవేసుకొన్నది. నారాయణ రెడ్డి దంపతులు తమ ఏకైక పుత్రికకు బుచ్చమ్మ అని నామకరణం చేసినా, బాల్యంలో అందరూ ఆమెను సతీసావిత్రిదేవి అని పిలువడంతో ఆపేరే ధృవపడింది. చిన్ననాటి నుండే సావిత్రీదేవి కూడ దైవభక్తి పరాయణురాలు. రాజకీయ కుటుంబంలో పుట్టి పెరగడంవల్లనేమో ఆమెకు కూడా రాజకీయ పరిస్థితి పట్ల కొద్దోగొప్పో అవగాహన ఉన్నది. ఆమె మితభాషి.

చెన్నారెడ్డి తల్లిదండ్రులకు రొమ్మువిరిచి చెప్పుకునేందుకు రెండువందల ఎకరాల వ్యవసాయ భూమి ఉన్నప్పటికి అది రాళ్లురప్పలు కొండలతో కూడిన తెలంగాణా పీఠభూమి అవడంవల్ల ఆదాయం అంతగా లేకపోయింది. పరిమిత వనరులతో ఖరీదైన వైద్యవిద్యను అభ్యసించడం చెన్నారెడ్డికి కష్టమైపోయింది. తరగతిలో 25 మంది విద్యార్థులలో ఏడుగురు మాత్రమే వైద్యశాస్త్ర పరీక్షలో ఉత్తీర్ణులు కాగా చెన్నారెడ్డి వారిలో ప్రధమస్థానం సంపాదించారు. అయితే కష్టించి చదివి ప్రతిభతో సంపాదించుకున్న స్కాలర్‌షిప్ చెన్నారెడ్డి విద్యాభ్యాసంలో కొనసాగించేందుకు కొంతవరకు తోడ్పడింది

మంచిమార్కులు పేరు ప్రతిష్ఠలు తెచ్చుకొనేందుకు ఒకవైపు శ్రమిస్తూనే తన రాజకీయ కార్యకలాపాలలో భాగంగా వయోజన విద్యాకేంద్రాలు నిర్వహించేందుకు, గ్రంథాలయం ఉద్యమం ముమ్మరం చేసేందుకు, సాంస్కృతిక వక్తృత్వ పోటీల ద్వారా రాజకీయ చైతన్యాన్ని పెంపొందించేందుకు కూడ చెన్నారెడ్డి తమ కృషిని కొనసాగించారు. 1938 సంవత్సరంలో రెడ్డి హాస్టల్ నిర్వహించిన ఆంధ్ర యువజన సంఘ మహాసభలతో చెన్నారెడ్డి ప్రతిష్ట ఇనుమడించింది. సభలపై ఉన్న నిషేధాన్ని ధిక్కరించి, హాస్టల్ యాజమాన్యం

అనుమతికూడ పొందకుండా చెన్నారెడ్డి ఈ సభలు నిర్వహించి వాటికి అధ్యక్షత వహించారు.

ఆ రోజులలో పోలీస్ కమీషనర్‌గా ఉన్న రాజాబహదుర్ పింగళి వెంకట రామారెడ్డిగారే హాస్టల్ యాజమాన్య సంఘ కార్యదర్శిగా కూడ ఉన్నారు. సభ జరపకుండా తన జంట హెూదాలలో చెన్నారెడ్డిని నివారించేందుకు విఫలయత్నం చేసిన వెంకట రామారెడ్డిగారు ఆ ఉద్రిక్త వాతావరణంలో సమయస్ఫూర్తినే ప్రదర్శించడం మంచిదని భావించారు. వెంకట రామారెడ్డిగారికి సౌమ్యుడు, సహృదయుడు, శాంతిభద్రతల పరిరక్షణకుడుగాను నియమ నిబంధనలలో సర్దుబాటు చేసే గుణం ఉన్నవారని పేరు ఉన్నది. ఏమైతేనేం రెడ్డి హాస్టల్ సభల సాహసోపేత నిర్వహణ అనంతరం యువచెన్నారెడ్డి వెంకట రామారెడ్డిగారికి సన్నిహితులు అయ్యారు. ఆ తర్వాత అనేక పర్యాయాలు పోలీసులను ధిక్కరించి చెన్నారెడ్డి తన ఉద్యమాలను ముందుకు తీసుకువెళ్ళడం జరిగింది. ఆంధ్రమహాసభలో కమ్యూనిస్టులు కాంగ్రెస్‌వారు కలిసి పనిచేసినప్పటికి క్రమక్రమేణా ఉద్యమ ఆశయాల కంటే తమ పార్టీ సిద్ధాంతాలకే కమ్యూనిస్టులు అధిక ప్రాధాన్యత ఇవ్వడం మొదలుపెట్టారు. ఈ పరిస్థితి ఆంధ్ర మహాసభ రెండువర్గాలుగా చీలడానికి అంకురార్పణ చేసింది.

తమ పార్టీ సిద్ధాంతాలు ప్రభోదించేందుకు అయిదుగురు సభ్యులు గల ఒక్కొక్క బృందానికి కమ్యూనిస్టు నాయకులు రహస్యంగా తమ పార్టీ సిద్ధాంతాన్ని ప్రభోదించారు. అలా తరగతులు నిర్వహించేవారు తమ పేరు కూడా వెల్లడి చేయకుండా మారుపేరుతో అధ్యాపకులుగా వ్యవహరించేవారు ఈ విషయం తెలుసుకున్న చెన్నారెడ్డి, తన సహచరులను కలుపుకొని నియమ ప్రకారం అయిదుగురు సభ్యుల జంటగా, ఒక అధ్యాపకుని ఆశ్రయించారు. గాందేయవాదివై ఉండి నీకు కమ్యూనిస్టులతో సంబంధం ఏమిటని ఒక మిత్రుడు ప్రశ్నించగా వారి

ప్రభోధమేమిటో కూడ మనం తెలుసుకోవాలి అప్పుడే దానిని సమర్ధవంతంగా ప్రతిఘటించగలమని చెన్నారెడ్డి సమాధానం చెప్పారు. నాలుగు రోజులు తరగతులకు హాజరై అనేక ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరి చేయడంలో అధ్యాపకుడు తన శిష్యుల నాటకం పసిగట్టి బోధనను నిలిపివేశారు. ఆ అధ్యాపకుడు మరెవరో కాదు కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారే. హైదరాబాద్ రాష్ట్రంలో విద్యార్థులు నిర్వహించిన వందేమాతరం ఉద్యమంలో చెన్నారెడ్డి ముఖ్యభూమికను నిర్వహించారు. ఈ ఉద్యమంలో పాల్గొన్న ప్రముఖులను ఉస్మానియా విశ్వవిద్యాలయం అధికారులు తరగతుల నుండి బహిష్కరించారు.

వీరిలో చాలామంది నాగపూర్ విశ్వవిద్యాలయానికి వెళ్లి విద్యాభ్యాసం కొనసాగించారు. ఆ విశ్వవిద్యాలయంలో వైద్య, ఇంజినీరింగ్ కోర్సులులేనందున, ఉస్మానియా వైద్యకళాశాల ఇంజినీరింగ్ కళాశాల విద్యార్థులు పరోక్షంగా తప్ప ప్రత్యక్షంగా వందేమాతరం ఉద్యమంలో పాల్గొన కూడదనే నిర్ణయం విద్యార్థి సంఘం చేసింది. తరువాత 1942లో భారతదేశంలో క్విట్ఇండియా ఉద్యమం జరిగిన సందర్భంలో కూడ హైదరాబాద్ రాష్ట్రంలో ఎన్నో కార్యక్రమాలు జరిగాయి. ఆ తరువాత సంవత్సరాలలో చెన్నారెడ్డి యం.బి.బి.యస్. పరీక్షను ఉత్తమశ్రేణిలో పూర్తి చేసి ప్రభుత్వ ఉద్యోగంలో చేరారు.

# 3. రాజకీయాలలో ప్రవేశం

జాతీయభావాల వలన ప్రభావితులైన చెన్నారెడ్డికి నైజాం ప్రభుత్వ ఉద్యోగంలో కొనసాగడానికి మనస్కరించక దానిని త్యజించి రెండు ప్రయివేటు నర్సింగ్‌హోంలు స్థాపించి నిరుపేద రోగులకు ఉచిత సేవచేశారు. ఇవి "కాకతీయ క్లినిక్" పేరున శాలిబండ, ఫీల్‌ఖానా ప్రాంతాలలో ఉండేవి. సేవా భావంతోపాటు రాజకీయ పరిస్థితి పట్ల ఆసక్తి పెరుగుతున్న చెన్నారెడ్డికి దేశం కొరకు తమ వృత్తులను త్యాగం చేసిన సర్ తేజ్ బహదూర్ సప్రూ, జవహర్‌లాల్ నెహ్రూ, టంగుటూరి ప్రకాశం, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతుల అడుగుజాడలలో నడవాలనే సంకల్పం కలిగింది.

ఉపాధి కొరకు ఉద్యోగంచేయకున్నా దైనందిన జీవితం గడిపేందుకు వనరులు ఉన్న యువకులు కొందరైనా స్వార్థాన్ని విస్మరించి పూర్తికాలం రాజకీయ కార్యకలాపాలకు వినియోగించితే తప్ప అగ్రశ్రేణి నాయకులకు తగిన అండదండలు సమకూర్చలేరనే భావం రెడ్డి మనసులో స్థిరపడడంతో

ఆయన తన వైద్యవృత్తిపట్ల ఆసక్తి తగ్గించారు. అదే సమయంలో భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చేందుకు బ్రిటీష్ ప్రభుత్వం అంగీకరించి బాధ్యతలు స్వీకరించేందుకు సన్నద్ధులు కావాలని జాతీయనాయకులను కోరింది. ఈ దశలో శ్రీ చెన్నారెడ్డి కొందరు మిత్రులతో కలిసి ఢిల్లీ వెళ్లి పండిత నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, రఫీ మహమ్మద్ కిద్వాయ్ ప్రభృతులను సందర్శించారు.

హైదరాబాద్ విముక్తి పోరాటం చివరిదశను మరీ ఉధృతంగా కొనసాగించవలసిన అవశ్యకత ఈ హైద్రాబాద్ బృందం జాతీయనాయకులతో చర్చించిన అనంతరం గాంధీజీ ఆశీర్వచనం పొంది తిరిగి వచ్చారు. రాష్ట్ర కాంగ్రెస్ సంకల్పాన్ని పసికట్టిన నైజాం నిరంకుశ పాలకుడు రాష్ట్ర కాంగ్రెస్‌పై నిషేధం విధించడమే కాక, కొందరు మొహమ్మదీయ తీవ్రవాదులు రజాకార్ సంస్థను ఏర్పరుచుకొనేందుకు ప్రోది చేశారు. భారతదేశాన్ని మతప్రాతిపదికపై భారత్-పాకిస్తాన్ అనే రెండు దేశాలుగా విభజించి స్వాతంత్ర్యం ప్రసాదించాలని బ్రిటీష్ పార్లమెంటు నిర్ణయించిన దరిమిలా మనదేశంలో మధ్యంతర ప్రభుత్వం ఏర్పడింది. విభజనకు తుదిరూపం కల్పించేందుకు. వైస్రాయ్‌గా లార్డ్ మౌంట్‌బాటెన్ వచ్చారు. ఆ దశలో కమ్యూనిస్టేతర శక్తులతో కూడిన ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర పరిషత్తు, కన్నడ పరిషత్తుల వారు ఏకమై హైదరాబాదు నగరంలో మూడు రోజులపాటు తొలి స్టేట్ కాంగ్రెస్ మహాసభలు జరిపారు. ఈ మహాసభలకు చెన్నారెడ్డిగారు ఆహ్వాన సంఘకార్యదర్శిగా విస్తృత ఏర్పాట్లు జరిగాయి. ప్రస్తుతం జనారణ్యం - నాడు సాదాసీదా అరణ్యంగా ఉన్న అశోక్‌నగర్ ప్రాంతంలో ప్రతినిధుల విడిదికి పాకలను సభలకు విశాలమైన గుడారాలను వేయించారు. సమావేశాలు పూర్తి కాగానే రజాకార్లు గుడిసెలకు నిప్పుపెట్టగా ప్రభుత్వం కాంగ్రెస్ నాయకుల నిర్బంధానికి ఉత్తర్వులు జారీచేసింది.

# మహానాయకుడు మట్టి చెన్నారెడ్డి

డా॥ బూర్గుల రామకృష్ణారావు, కె.వి.రంగారెడ్డి, చెన్నారెడ్డితో సహా పలువురు చెంచల్‌గూడ జైలుకు తరలించబడ్డారు. కొద్దిరోజులకే నైజాం తమ ప్రధానమంత్రిగా మీర్‌లాయక్ అలీని నియమించారు. రాజకీయ సమస్యకు పరిష్కారం సాధించాలనే చిత్తశుద్ధి తమకు ఉన్నదనే అభిప్రాయం నైజాం వ్యతిరేక ఉద్యమకారులకు కల్పించాలనే ఉద్దేశ్యంతో రాష్ట్ర వ్యాప్తంగా పదిమంది ముఖ్యనాయకులను జైలు నుండి విడిపించి చర్చలకు ఆహ్వానించారు. డా॥ బూర్గుల, రంగారెడ్డి, చెన్నారెడ్డి ప్రభృతులు విడుదలైన వారిలో ఉన్నారు.

చర్చలు ఫలించలేదు. పోలీసులు రజాకార్ల దమనకాండ హెచ్చిపోయింది. మరిన్ని నిర్బంధాలు జరిగాయి. ప్రజలను దోచుకొని, మహిళలను మానభంగాలకు గురిచేసి ఎన్నో గ్రామాలను భస్మీపటలం చేసిన రాజాకార్ బృందాల బీభత్సానికి హడలెత్తిన ప్రజలు పొరుగు రాష్ట్రాలకు వలస వెళ్లారు. రాష్ట్ర కాంగ్రెస్‌లో కొందరు తీవ్రవాదులు సరిహద్దులకు ఆవలివైపున పొరుగు రాష్ట్రాలలో సాయుధ శిబిరాలు నెలకొల్పి, రజాకార్ బృందాలను ఎదుర్కొనేందుకు సంసిద్ధులైనారు. ఆ దశలో శ్రీ చెన్నారెడ్డి తన బసను బెజవాడకు మార్చి అక్కడ నుండి "హైదరాబాద్" అనే ఒక వారపత్రికను ప్రారంభించారు. నైజాం ప్రభుత్వ అరాచ కాలను తీవ్రపదజాలంతో ఖండిస్తూ దేశభక్తి ప్రభోదిత వ్యాసాలతో పాఠకులను ఉద్రూతలూగించిన ఈ పత్రిక ప్రతులు దొంగచాటుగా నైజాం రాష్ట్రంలో వివిధ ప్రాంతాలకు చేరే ఏర్పాటు కూడ చెన్నారెడ్డి చాకచక్యంగా చేయగలిగారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి కందుల ఓబులరెడ్డి మరికొందరు ఆంధ్రనాయకుల సహాయంతో విజయవాడ వెళ్లిన హైదరాబాదు కాందిశీకులకు ఉడతాభక్తి సహాయం చేసేవారు చెన్నారెడ్డి.

ఆయన విజయవాడలో ఒకచిన్న అద్దె ఇంట్లో ఉంటూ అందులోనే ఒక గదిని తన కార్యాలయంగా మార్చారు. కుమారులు కృష్ణారెడ్డి, రవీందర్‌రెడ్డిని,

బావమరిది వెంకటరెడ్డిని ఆఫీసు కార్యదర్శిని చేసి చెల్లెలు విమలను సావిత్రీదేవికి సహాయకురాలిగా ఏర్పాటుచేశారు. తమ బాధ్యతా నిర్వహణలో చెన్నారెడ్డి ఎంత కచ్చితంగా ఉంటారో తను బాధ్యతలు అప్పగించిన వారి నుండీ చెన్నారెడ్డి గారు అదే కోరుతారు. అయన ఏ పనిచేసినా ఒక పద్ధతిని క్రమశిక్షణను పాటిస్తాడు. మెట్రిక్ పరీక్షకు కూర్చొనవలసిన సావిత్రీదేవిగారు పరీక్షల ముందు కూడ చదువుకునే వ్యవధి లేకుండా చెన్నారెడ్డిగారు రాజకీయ బాధ్యతలను అప్పగించేవారు. పైగా ఆమె ఆచార్య రంగాగారు నిర్వహించే రాజకీయ శిక్షణా తరగతులలో కూడ విధిగా పాల్గొనేది.

హైదరాబాదులో జరుగుతున్న అరాచకాన్ని గురించి తెలుసుకున్న గాంధీగారు పరిస్థితిని స్వయంగా అధ్యయనం చేసి రావలసినదిగా తమ విశ్వాసపాత్రురాలు ప్రొఫెసర్ బన్నాలీని విజయవాడ పంపించారు. ఆ సమయంలో ఇతర ముఖ్య కార్యక్రమాలలో తలమునకలై ఉన్న రెడ్డిగారు విమలమ్మను సహాయం తీసుకొని ప్రొఫెసర్ బన్నాలీ బృందానికి సరిహద్దు గ్రామాలు చూసిరావలసినదిగా శ్రీమతి సావిత్రీదేవిని ఆదేశించారు.

భర్తకు మారు చెప్పలేని ఆ మహాఇల్లాలు ప్రొఫెసర్ బన్నాలీ బృందం వెంట పర్యటనకు వెళ్లి తన బాధ్యతను నిర్వహించింది. అందుకే రాజకీయ ఉద్యమాలలో తలమునకలై చిత్తశుద్ధితో పనిచేసేవారు అస్మదీయులను కూడ కనికరించ లేరంటే అతిశయోక్తి కాదు. 1948 సెప్టెంబర్‌లో హైదరాబాద్ విమోచన జరిగి రాష్ట్రం భారతదేశంలో అంతర్భాగమైన తరువాత రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు పలువురు స్వస్థలాలకు తిరిగి వచ్చి మామూలు పరిస్థితులు నెలకొల్పడంలో సైనికపాలకులకు తోడ్పడ్డారు.

ఒక మతానికి చెందిన కొందరి మెదడులో చీడపురుగులు చేరి వారు సమాజాన్ని పీడిస్తే ఆ మతానికి చెందిన వారందరు అలాగే చేస్తారనుకొని

అందరిని దండించడం భావ్యంకాదు. కొందరు మహమ్మదీయులు రజాకార్ల బృందాలలో చేరి దుర్మార్గాలకు పాల్పడినంత మాత్రాన మహమ్మదీయుల నందరిని దండించడం న్యాయంకాదు కదా.

అందువలన హైదరాబాద్ రాష్ట్రంపై పోలీసు చర్య అనంతరం హిందువులు దౌర్జన్యాలకు గురియైన పలు మహమ్మదీయ కుటుంబాలను హిందువులే ఆదుకొని ఆశ్రయం కల్పించారు. పలువురు కాంగ్రెస్ కార్యకర్తలు దోపిడీకి గురియైన సామానులను పట్టుకొని వాటి యజమానులైన మహమ్మదీయులకు అప్పగించారు. ఈ కార్యక్రమంలో తోటి కార్యకర్తలకు ప్రేరణ ఇచ్చి నాయకత్వాన్ని సమకూర్చిన రెడ్డిగారు ఒక జీపులో అనేక ప్రాంతాలు అనేక గ్రామాలు ఉధృతంగా తిరిగి లూటీ జరిగిన సామానులను వెంటాడి పట్టుకొని యజమానులకు, అప్పగించి వారి మెప్పుపొందారు.

రజాకార్లు జరిపిన దాడుల నుండి ప్రజలు తెప్పరిల్లుకొనకముందే గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములు అని పిలువబడి అజ్ఞాతవాసంలో ఉన్న సాయుధ కమ్యూనిస్టుల అరాచకాలకు, మరొకవైపు కమ్యూనిస్టుల అణచివేతకు వచ్చిన సైనికుల మితిమీరిన ఆగడాలకు గురియైన రైతులను అమాయక ప్రజలను పరామర్శించి, వారికి అండదండలు తెలిపి సహాయకార్యకలాపాలు చేబట్టేందుకు చెన్నారెడ్డిగారు తన సహచరులతో తెలంగాణ ప్రాంతమంతా ఉధృతంగా పర్యటించాడు.

చెన్నారెడ్డి బృందం వెంట పర్యటించిన శాసనసభ్యురాండ్రలో ఒకరైన, నాటి సుప్రసిద్ధ రాజకీయ కార్యకర్త మాజీ పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి సంగం లక్ష్మీబాయిగారు ఆనాటి తమ అనుభవాల గురించి ఇలా వ్రాశారు. “అది పెద్ద గ్రామము. కమ్యూనిస్ట్‌వారు ఉండుటవలన, ఇండియా గవర్నమెంటు వారు మిల్టరీ సెంటరు పెట్టినారు. అక్కడి పెద్దమనుషులు మాకు ఆశ్రయం

ఇవ్వడానికి భయపడినారు. ఒక వృద్ధుడు దయదలచినాడు. అక్కడ ఒక పశువులశాల ఉన్నది. పశువులు వరండాలో ఉన్నవి. ఆ (పశువుల) గదిని మాకు ఇచ్చినాడు. గదినిండా గడ్డి ఉంది. ఎలుకలు, పందికొక్కులు, దోమలు బల్లులు ఉన్నాయి. గదిలో దీపము లేదు. మావద్ద నిప్పుపెట్టె కూడలేదు. దోమలు కుట్టకుండా ముసుగులు వేసుకొని మాట్లాడుకుంటూనే రాత్రి గడిపినాము. ప్రొద్దున్నే ఒకాయన వచ్చి పట్వారీ ఇంట్లో స్నానాలు, నాస్తాలు చేయండి అని మర్యాదగా ఏర్పాటు చేసినారు. ఇటువంటి సంఘటనలు ఎన్నో అనుభవించినాము. ఎండలో ఎండి వానలో తడిసి ఎన్ని అవస్థలు పడినామో ఆ భగవంతునికి తెలుసును.

చెన్నారెడ్డిగారికి చిన్ననాటి నుండే - బహుశా బాల్యంలో ఒక నాటకంలో అయన బాలిక పాత్ర పోషించినప్పటి నుండి కావచ్చు - మహిళల పట్ల అభిమానం మెండు అని చెబుతారు. కళాశాల విద్యార్థిగా ఉన్నపుడు తన తరగతిలో మంచి మార్కులు తెచ్చుకున్న ఒక బాలికకు సత్కారం జరిపేందుకు ఆయన ఒక సంఘాన్నే స్థాపించారు. 1950లో పార్లమెంటు సభ్యుడుగా ఉన్నప్పుడు మహిళా సభ్యులందరూ ఆయన ఎక్కడ నిల్చొంటే అక్కడ గుంపుగూడేవారట.

బాధితులకు సహాయం చేసే కార్యక్రమాలపట్ల శ్రద్ధ చూపుతూనే రెడ్డిగారు ఆచార్య రంగాగారు రైతుకూలి శిక్షణ శిబిరాలు నిర్వహించడంలో తోడ్పడి, కాంగ్రెస్ కార్యకర్తలకు వార్ధాలో జరిగే పద్ధతులలో సర్వోదయ శిక్షణ కేంద్రాలు ఎన్నో నిర్వహించారు. అలాంటి ఒక కేంద్రం గురించి మాజీ పార్లమెంటు సభ్యురాలు సంగం లక్ష్మీబాయిగారు తమపాత జ్ఞాపకాలను ఇలా నెమరేసుకున్నారు. "రిలీఫ్ వర్క్ అయిన తరువాత గోల్కొండ దగ్గర సర్వోదయ కేంద్రం నడిపారు. కొండా వెంకట రంగారెడ్డిగారు, హరిశ్చంద్ర హెడా, జ్ఞానకుమారి

మొదలైన మహిళలు కూడా ఉన్నారు. శ్రీమతి సావిత్రమ్మగారు కృష్ణ, రవి, శశి (6 నెలల పిల్లవాడు)తో కలిసి ఈ శిబిరంలో ఉన్నారు. గంట గంటకు ప్రత్యేక కార్యక్రమంతో ఒక శిక్షణతో క్రమశిక్షణతో 15 రోజులు వారి పద్ధతిలో ఈ శిక్షణాశిబిరం నిర్వహించారు.

# 4. పదవీ కిరీటాలు

1951-52 సంవత్సరాలలో తాత్కాలిక పార్లమెంటులో హైదరాబాద్ రాష్ట్రం నుండి ప్రతినిధులకు అవకాశం లభించగా, వారిలో చెన్నారెడ్డి ఒకరైనారు. సభలో అడుగిడిన మరుక్షణమే తెలంగాణ యువకిశోరం హైదరాబాద్ రాష్ట్రంలో నాటి పరిస్థితి గురించి ప్రభుత్వం తీసుకొనవలసిన చర్యల గురించి చేసిన గంభీరోపన్యాసాలు సభికులను ముగ్ధులను చేయగా పత్రికలు పతాకశీర్షికలలో ప్రచురించాయి. అందువలన సభలో అడుగిడి వారం తిరుగక మునుపే శ్రీ చెన్నారెడ్డి అధికార కాంగ్రెస్ పార్టీలో ఒకరైపోయారు. రాజాజీతో సహా ఎందరో అగ్రనాయకులు ఆయనను ఎంతగానో అభినందించి ఆదరించారు.

దేశంలో ఇతర ప్రాంతాలతోపాటు హైదరాబాద్ రాష్ట్రంలో కూడ 1952లో తొలి సార్వత్రిక ఎన్నికలు జరిగినప్పుడు డా॥ చెన్నారెడ్డి వికారాబాదు నియోజకవర్గం నుండి రాష్ట్ర శాసనసభ్యుడిగా ఎన్నికైనారు. పోటీకి కాంగ్రెస్ అభ్యర్థులను ఎంపిక చేయడంలో కూడ చెన్నారెడ్డి ముఖ్య భూమికను నిర్వహించారు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

తమ 12 మంత్రివర్గ సభ్యులలో ఒకరిగా డా॥ చెన్నారెడ్డిని ఎంచుకున్న ముఖ్యమంత్రి డా॥ బూర్గుల రామకృష్ణారావు ఆయనకు వ్యవసాయం, ఆహారం, ప్రజాపంపిణీ శాఖలను అప్పగించారు. దేశం అంతా ఆహారధాన్యాల కొరతతో సతమవుతున్న ఆ రోజులలో హైదరాబాద్ రాష్ట్రమంతటా రేషనింగ్ అమలులో ఉన్నది.

ఆహారధాన్యాల సమీకరణ, నిలువ, పంపిణీ విధానాలను క్రమబద్ధం చేసేందుకు చెన్నారెడ్డి జరిపిన కృషి అందుకుగాను ఆయన ప్రభుత్వ యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరించిన తీరు, వ్యవసాయదారులకు వెన్నెముకగా నిలిచి, వారి అవసరాలు తీర్చిన విధానం అందరి ప్రశంసలు పొందింది. ఆచార్య యన్.జి.రంగాగారు ఆ రోజులలో కాంగ్రెస్‌లో లేనప్పటికీ వారితో స్నేహంగా ఉన్న చెన్నారెడ్డి వారిచ్చిన కొన్ని సలహాలను కూడ పరిశీలించి ఆమోదించడం గమనార్హం.

'చక్రవర్తుల రాజగోపాలాచారి చొరవతో నేను చేసిన సూచనలను కూడ పరిగణనలోకి తీసుకున్న చెన్నారెడ్డిగారు సాహసోపేతంగా కంట్రోళ్లను ఎత్తి వేశా' రని రంగాగారు తమ వ్యాసాలలో ఒక చోట చెన్నారెడ్డిని అభినందించారు. ముఖ్యమంత్రి రామకృష్ణారావు ఆశీర్వచనంతో, రైతుల సమస్యలు చర్చించేందుకు రాష్ట్ర స్థాయిసదస్సు జరిపిన చెన్నారెడ్డి జంకూగొంకూ లేకుండా తమకు, ఆ సమావేశాలలో పాల్గొనే అవకాశం కల్పించినందుకు కూడా రంగాగారు చెన్నారెడ్డిని ఎంతగానో ప్రశంసించారు.

రైతులలో ఒకరుగా పేరు పొందిన చెన్నారెడ్డి 1953లో రోమ్‌నగరంలో జరిగిన అంతర్జాతీయ వ్యవసాయోత్పత్తి దారుల మహాసభలలో భారత రైతుబృందం నాయకుడుగా పాల్గొన్నారు. తిరిగి 1955లో రోమ్‌నగరంలోనే

జరిగిన ఎఫ్.ఏ.ఒ. సమావేశానికి భారత ప్రతినిధి వర్గం ఉపనాయకుడిగా హాజరైన చెన్నారెడ్డి, సమావేశాల అనంతరం ఫ్రాన్స్, జర్మనీ, ఇంగ్లాండ్, స్విట్జర్లాండ్‌తో సహా 13 యూరప్ దేశాలు సందర్శించి వ్యవసాయం, పరిశ్రమల గురించి అధ్యయనం చేశారు. తిరిగి వచ్చిన అనంతరం చెన్నారెడ్డి సమర్పించిన నివేదికలలో చేసిన పలు సిఫారసులను కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది.

రాష్ట్ర ప్రభుత్వాలలో వ్యవసాయ, ఆహార, పౌరసరఫరా శాఖలు నిర్వహించే మంత్రులు సాధారణంగా కేంద్ర ఉత్తర్వులనే శిరసావహించి అమలు జరుపుతుంటారు. ఇందుకు భిన్నంగా చెన్నారెడ్డి కేంద్ర ఆహార పౌరసరఫరా శాఖమంత్రి కిద్వాయ్ గారికే ఎన్నో సూచనలు చేసి శభాష్ అనిపించుకున్నారు. డాక్టర్ రెడ్డిగారు చేసిన సూచనమేరకే కిద్వాయ్ గారు రేషనింగ్ రద్దు చేయాలనే ప్రతిపాదనను కేంద్రమంత్రి వర్గం ముందు ఉంచి ఆమోదం పొందారు. డాక్టర్ రెడ్డి కిద్వాయ్ సన్నిహిత స్నేహితులు, ఉస్మాన్‌సాగర్ చెరువు సమీపాన వ్యవసాయ కళాశాల ప్రాంతాన్ని పూలమొక్కలు, ఉద్యానవనాలతో తీర్చి దిద్దించి అక్కడొక అతిధి గృహం నిర్మాణానికి ఏర్పాట్లు చేసి దానికి కిద్వాయ్ కాటేజ్ అని నామకరణం చేశారు రెడ్డిగారు. చెన్నారెడ్డి విజ్ఞప్తిపై నాలుగురోజులు హైదరాబాద్ నగరంలో విశ్రాంతి తీసుకున్నప్పుడు నాటి రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ గారు ఈ కాటేజ్‌లో ఎంతో హాయిగా ఆనందంగా బసచేయడం వలన ఆ ప్రాంతమంతటికీ రాజేంద్రనగర్ అని పేరు పెట్టడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయంగా రూపు సంతరించుకొని దేశమంతటా పేరు ప్రతిష్టలు పొంది సుప్రసిద్ధ వ్యవసాయ విద్యాసంస్థ, అక్కడ ఉన్న వ్యవసాయ పరిశోధనా క్షేత్రాలు డా॥ రెడ్డిగారి చొరవ, ప్రేరణలతోనే నెలకొన్నాయి. అంతకుముందు అక్కడ నెలకొని ఉన్న ఉస్మానియా వ్యవసాయ

కళాశాల, పశువర్ధక కళాశాలలను చెన్నారెడ్డి మంత్రిగా ఉన్న రోజులలో అవసరమైన నిధులను ప్రభుత్వం నుండి సమకూర్చి ఎంతో విస్తరింప చేశారు. ఆ తరువాత రోజులలో ఉస్మానియా విశ్వవిద్యాలయం సిండికేట్ సభ్యుడిగా రాష్ట్ర అర్థికమంత్రిగా ఉన్నప్పుడు ముఖ్యమంత్రితో వివాదం ఏర్పడినా వెనుకాడక వ్యవసాయ విద్యాలయం స్థాపించాలన్న తన లక్ష్యాన్ని సాధించారు.

1955లో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడనున్న సందర్భంలో, హైదరాబాదును మూడుభాగాలుగా విభజించి తెలుగు మాట్లాడే ప్రజలు ఉన్న తెలంగాణ జిల్లాలను ఆంధ్రలో విలీనం చేసేందుకు చెన్నారెడ్డి అంగీకరించలేదు. వివిధ రంగాలలో వెనుకపడి ఉన్న తెలంగాణ ప్రజలు అన్ని రంగాలలో అభివృద్ధి చెందిన తమ ఆంధ్ర సోదరులతో నూతన రాష్ట్రంలో సమ ఉజ్జీకాజాలరనీ, అసమానత విభేదాలకు దారి తీసే అవకాశం ఉన్నందున కొంతకాలంపాటు తెలంగాణ ప్రజలు స్వతంత్రంగా జీవించి అభివృద్ధి పథంలో పురోగమించే కృషి చేయాలని చెన్నారెడ్డి వాదించారు.

ఈ వాదనతో ఏకీభవించిన రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం హైదరాబాద్‌ను ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగనీయాలని సూచన చేసింది. అయితే ఆ తర్వాత శాసనసభకు ఎన్నిక కానున్న ప్రతినిధుల అభిప్రాయాలు సేకరించిన అనంతరం రెండు ప్రాంతాలను కలిపి తెలుగు వారి విశాల రాష్ట్రం ఏర్పాటు చేయవచ్చునని రాష్ట్రాల పునర్విభజన సంఘం అభిప్రాయపడింది.

ఎంతోకాలంగా తెలుగు ప్రజల విశాలరాష్ట్రం కొరకు పోరాటం జరుపుతున్న ఆంధ్రనాయకులు, కొందరు తెలంగాణ నాయకులు తక్షణం విశాల రాష్ట్రం ఏర్పాటుకు ప్రయత్నం చేశారు. పండిత నెహ్రూ, అబ్దుల్ కలామ్ ఆజాద్, గోవింద వల్లభపంత్ ఉభయ ప్రాంతాల నాయకులతో సుదీర్ఘచర్చలు

జరిపిన దరిమిలా తెలంగాణ ప్రాంత ప్రజల ప్రయోజన పరిరక్షణకు ఆంధ్ర నాయకులు కొన్నిహామీలు ఇచ్చేందుకు అంగీకరించారు. ఉద్యోగాలు, విద్య విషయంలో స్థానికులకు ఒక స్థాయివరకు ప్రాధాన్యత ఇవ్వడం, ప్రాంత అభివృద్ధి సమీక్షించి తగిన సూచనలు చేసేందుకు చట్టబద్ధమైన ప్రాంతీయ సంఘం ఏర్పాటు ఈకాలంలో చోటు చేసుకోవడంలో 1956 నవంబర్ మొదటి తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించి తెలంగాణ ప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో విలీనమైంది. హైదరాబాద్ రాష్ట్రంలో భాగమైన కన్నడ భాష ప్రాంతాలు కర్నాటక రాష్ట్రంలో మరాఠీ భాష ప్రాంతాలు సంయుక్త మహారాష్ట్రలోను విలీనం అయ్యాయి.

శ్రీ నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ తొలిమంత్రివర్గంలో హైదరాబాద్ నుండి శ్రీ కొండా వెంకటరంగారెడ్డిగారికి అవకాశం దొరికినందున శ్రీ చెన్నారెడ్డి మంత్రిగా నియుక్తులు కాలేదు. అది కేవలం 12 మంది మంత్రుల చిన్న మంత్రివర్గం కావటం వలన ఆంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రతినిధులకు తగు నిష్పత్తికి మించి ప్రాతినిధ్యం లభించలేదు.

# 5. హక్కుల కొరకు పోరాటం

ఆ తరువాత కొంతకాలానికి తెలంగాణా ప్రాంతీయ సంఘాన్ని ఏర్పాటు చేస్తూ పార్లమెంటు శాసనం చేసింది. ఈ ప్రాంతీయ సంఘంలో ప్రణాళిక అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన ఉపసంఘం అతిముఖ్యమైనది. ఈ సంఘ అధ్యక్షస్థానానికి ఎన్నికైన డా॥ చెన్నారెడ్డి 1958-1962 మధ్యకాలంలో తెలంగాణ అభివృద్ధి ప్రణాళికలు వాటి అమలుకు వనరుల సమీకరణ గురించి అమోఘమైన కృషిచేశారు. తమ పదవీకాలంలో ఆయన ప్రభుత్వానికి 39 నివేదికలు సమర్పించారు. ఈ సమయంలోనే కొంతకాలం డా॥రెడ్డి గారు కాంగ్రెస్‌ను వదిలి యన్.జి.రంగా గారితో చేరారు.

తెలంగాణ ప్రాంత ఆర్థికాభివృద్ధికి వెన్నెముక కాగల పోచంపాడు ప్రాజెక్టును ప్రణాళికలో తక్షణం చేర్చాలని కేంద్రప్రభుత్వాన్ని కోరేందుకు ఆయన ఒక ప్రతినిధి వర్గాన్ని కూడ ఢిల్లీ తీసుకువెళ్ళారు. ఈ ప్రాజెక్టు నిర్మాణా నికి చెన్నారెడ్డి ఒక ఉద్యమాన్నే నిర్వహించడంతో ప్రభావితమైన ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఈ ప్రాజెక్టు సమంజసత్వాన్ని ఆమోదించి బలపరచక

తప్పలేదు. తెలంగాణాకు అన్యాయం జరగకుండా నిరోధించడం తమ నైతిక బాధ్యతలాగా గుర్తించామని శ్రీ సంజీవరెడ్డి చెప్పారు. ఏమైతేనేమి ప్రణాళికా సంఘంచే దాని నిర్మాణానికి ఆమోదం సంపాదించి, 1963లో ప్రధాని జవహర్‌లాల్‌చే దానికి పునాది వేయించారు. మన రాష్ట్రంలో అది పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ పునాది వేసిన చివరి ప్రాజెక్టు.

'రీజినల్ కమిటీ ఉపసంఘ అధ్యక్ష హోదాలో శ్రీ చెన్నారెడ్డి గారు సమర్పించిన నివేదికలే విద్యారంగంలోను ఉద్యోగ విషయాలలో అభివృద్ధి పరంగాను తెలంగాణాకు జరిగిన అన్యాయాలను పరిదిద్దడంలో శ్రీ సంజీవరెడ్డి గారికి ఎంతగానో ఉపకరించాయి. మిగులు నిధులు సుమారు 45కోట్ల రూపాయలు తెలంగాణ అభివృద్ధికి నాల్గవ పంచవర్ష ప్రణాళికలో వినియోగ మయేందుకు డాక్టర్‌గారు దోహదం చేశారు. తెలంగాణాను సస్యశ్యామలంగా గుర్తించి ఎప్పటికప్పుడు పరిదిద్దేందుకు శ్రీ సంజీవరెడ్డిగారు చేసిన ప్రయత్నం ఆయన తరువాత ముఖ్యమంత్రియైన శ్రీ బ్రహ్మానందరెడ్డి కాలంలో జరుగలేదు. ఈ పొరపాటే తెలంగాణా ప్రాంతంలో ఆ తరువాత కాలంలో అసంతృప్తి పెల్లుబికేందుకు కారణమైనది. తమను ఓడించేందుకే కాంగ్రెసేతర పార్టీల వారేకాక పార్టీలో తమ ప్రత్యర్థులు పన్నిన కుట్రలను విచ్ఛిన్నం చేసిన చెన్నారెడ్డిగారు 1962లో జరిగిన సాధారణ ఎన్నికలలో మూడవసారి శాసనసభ్యులైనారు.

# 6. ఆంధ్రప్రదేశ్ మంత్రి

అంతవరకు రెండేండ్ల పాటు అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షపదవిలో ఉన్న శ్రీ సంజీవరెడ్డిగారు కూడా శాసనసభకు ఎన్నికై రాష్ట్రానికి తిరిగివచ్చి ప్రభుత్వాన్ని స్థాపించారు. శ్రీ దామోదరం సంజీవయ్యకు వారసత్వం అప్పగించి శ్రీ సంజీవరెడ్డి గారు ఢిల్లీ వెళ్ళిన అనంతరం ఇక్కడ రాజకీయ పరిస్థితులలో మార్పు వచ్చింది. అంతకుముందు సంజీవరెడ్డి మిత్రులుగా ఉండి ఆయన వల్ల లాభంపొందిన పలువురు రాజకీయ నాయకులు తమ స్వలాభం కొరకు ఆయనకు దూరమైనారు. నెల్లూరు జిల్లాకు చెందిన ఎ.సి.సుబ్బారెడ్డి మినహాయిస్తే తన విశ్వాసం చూరగొన్నవారిలో పలుకుబడిగల నాయకులు ముఖ్యంగా తెలంగాణా ప్రాంతం నుండి శ్రీ సంజీవరెడ్డికి కనుపించలేదు. ఆదశలో శ్రీ సంజీవరెడ్డి డాక్టర్‌గారి సహాయం కోరి ఆయన్ను తన మంత్రివర్గంలో సీనియర్ సభ్యుడుగా తీసుకొని ఆయనకు కీలకమైన పంచాయతీరాజ్ అప్పగించారు. గ్రామస్థాయి, సమితిస్థాయి, జిల్లాస్థాయిలలో మూడు దొంతరలుగా పరిపాలన వికేంద్రీకరణకు, ప్రజా ప్రతినిధులకు పాలనాధికారాలను, తమ అధీనప్రాంతంలో చేపట్టవలసిన

అభివృద్ధి కార్యక్రమాలను తామే నిర్ణయించుకొనే అధికారం తొలిసారిగా కల్పించి పంచాయతీరాజ్ విధానం అప్పటికి ప్రయోగాత్మక స్థితిలోనే ఉండటం వల్ల దానికి గట్టి పునాదులు వేసే బాధ్యత చెన్నారెడ్డిపై పడింది.

"నిర్విరామంగా ఆయన రాష్ట్రమంతా పర్యటించి ఎన్నో సభలు, సమావేశాలు గోష్ఠులు వివిధ స్థాయిలలో నిర్వహించి, అనేక జటిల సమస్యలు పరిష్కరించారు. అపారమైన శక్తి సామర్థ్యాలు జ్ఞాపక శక్తి కలిగియుండి, అప్పుడు 44 సంవత్సరాల యుక్త వయస్సులో ఉన్న చెన్నారెడ్డి, గ్రామీణ భారత రూపు రేఖలనే పూర్తిగా మార్చివేయాలన్న స్థిరసంకల్పాన్ని ఉత్సాహాన్ని ప్రదర్శించి నెప్రూ అభినందనలకు అర్హులైనారని సి. నరశింహంగారు అభిప్రాయ పడ్డారు. బ్రిటిష్ పాలనకు, స్వతంత్ర భారత యుగానికి సారధియైన ఈ ఐ.పి.యస్. అధికారి దేశంలో పాలనాదక్షుడిగా పేరుపొందారు. ఆయన తన సమకాలీన రాజకీయ నాయకులను ఎవరినీ పొగిడిన సందర్భాలు లేవు. పైగా నరశింహం గారి పేరు చెబితే, శ్రీ సంజీవరెడ్డి మినహా రాజకీయ నాయకులందరూ హడలెత్తేవారు. తనకు తగిన చోదకుడు దొరికిన అతిశక్తివంతమైన అశ్వంలా నరశింహం చెన్నారెడ్డి మంత్రిత్వశాఖలకు కార్యదర్శిగా పనిచేశారు.

అభివృద్ధి కార్యక్రమాల రూపకల్పన నిర్వహణలో ప్రజల క్రియాశీల భాగస్వామ్యం ఉంటే తప్ప అవి సత్ఫలితాలను ఇవ్వజాలవని ఆనాడే చెన్నారెడ్డి గ్రహించారనీ, పూర్వ హైద్రాబాదు రాష్ట్రంలో మంత్రిగా నాడు దేశంలో తొలి పర్యాయం ప్రారంభించబడిన సమకాలిక కార్యక్రమాలను అత్యంత సమర్థ వంతంగా అమలుజరిపి ఆ శాఖ కేంద్ర మంత్రి యస్. కె. డే ప్రత్యేక అభినంద నలు పొందిన చెన్నారెడ్డి గారి అనుభవం పంచాయతీ రాజ్, ప్రణాళిక శాఖల కార్యకలాపాలకు కొత్త ఊపును ఇచ్చినదని కూడా నరశింహంగారు వ్రాశారు.

అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలను క్రియాశీల భాగస్వాములను చేయడమే కాక మారిన పరిస్థితులతో పెనవేసుకొని పోయే విధంగా అధికారుల వర్తనలో కూడ చెన్నారెడ్డి అతి సౌమ్యంగా ఎన్నో మార్పులు తేగలిగి వారిలో ఊహాతీత పరివర్తనకు కారకులైనారని శ్రీ నరశింహంగారు అన్నారు. అభివృద్ధి కార్యక్రమాల పట్ల చెన్నారెడ్డి చూపిన శ్రద్ధ ఆయన తరువాత వారు కూడ కొనసాగించి ఉంటే ఈనాడు ఆంధ్రదేశంలో ఆర్థిక సాంఘిక పరిస్థితులు ఎన్నో మార్పులకుగురియై గ్రామాల రూపురేఖలు వికసిస్తూ ఉండెడివని శ్రీ నరశింహం అభిప్రాయపడ్డారు.

ఆంధ్రప్రదేశ్ ప్రథమ ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన మరొక సుప్రసిద్ధ ఐ.సి.యస్. అధికారి శ్రీ ఒ. పుల్లారెడ్డి గారు కూడ "శ్రీ చెన్నారెడ్డిగారు అసమాన పరిపాలనాదక్షుడు, కాకలు తీరిన రాజకీయ దురంధరుడు" అని అభివర్ణించారు. అవిశ్రాంతంగా అహోరాత్రాలు చెన్నారెడ్డి పనిచేయడం గమనిస్తూంటే ఈయనకు ఈ శక్తి ఎంతకాలం ఉంటుందా అనిపించేది నాకు అయితే కొందరు వ్యక్తులు కష్టించి పనిచేసి అధిక శక్తిని సమీకరించుకుంటారు. చెన్నారెడ్డి ఈ కోవకు చెందిన వారై ఉంటారు అన్నాడు శ్రీ పుల్లారెడ్డిగారు. ప్రజాస్వామ్యంలో నాయకులకు ఆగంతకుల బెడద అధికమవడంవల్ల అందరినీ సంతృప్తి పరచడం సాధ్యం కాదు అయితే చెన్నారెడ్డి మాత్రం తనను కలుసుకోవాలన్న ప్రతివారికీ (వారికి అనుకూలమైనప్పుడే కాకున్నా) సమయం కేటాయించడంలో గొప్ప నేర్పరితనం సంపాదించారని పుల్లారెడ్డి అభినందించారు.

బ్రిటిష్ ప్రభుత్వంలోను స్వతంత్ర భారతదేశంలో ప్రజాస్వామ్య పరిపాలనలోను బాధ్యతాయుత ఉన్నత పదవులు నిర్వహించిన పరిపాలనాదక్షులే కాక శాస్త్ర సాంకేతిక నిపుణుల ప్రశంసలను కూడ అందుకోగలగడం చెన్నారెడ్డి గారి అదృష్టమనే చెప్పాలి. స్వాతంత్ర్య ఉద్యమంలో జాతిపిత బాపూజీ ఆధునిక

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

భారత నిర్మాత జవహర్‌లాల్ సరసన పనిచేసిన ఎందరో త్యాగధనులు రాజకీయ దురంధరులు 1952-1962 మధ్యకాలంలో వివిధ రాష్ట్రాలలో ముఖ్యమంత్రుల పదవులు, మంత్రి పదవులు నిర్వహించినా ఎవరో ఒకరిద్దరు మాత్రమే చెన్నారెడ్డివలె విస్తృత ప్రశంసలు పొంది తమ శ్రమకు సేవకు గుర్తింపు పొందగలిగారు.

అంతర్జాతీయఖ్యాతినార్జించిన సుప్రసిద్ధ భారతశాస్త్రవేత్త డా॥ నాయుడమ్మ డా॥. చెన్నారెడ్డి గురించి వ్రాస్తూ ఇలా అన్నారు. రెడ్డిగారితో పనిచేసే అవకాశం లభించిన నేను ఆయన సహనాన్ని, చొరవను, విషయగ్రహణశక్తిని, స్పష్టమైన ఆలోచనాపద్ధతిని, ముందుచూపును, ధైర్యంగా నిర్ణయాలు గైకొని త్వరితగతిని వాటిని అమలు జరిపే లక్షణాన్ని ఎంతగానో అభినందించాను. అలక్ష్యం ఆయన బద్ధశత్రువు. శ్రమించి పనిచేయడం ఆయన జీవన విధానం.

"దేశంలో అనేకమంది సుప్రసిద్ధ వ్యక్తులు ఉన్నారు. వారిలో కొందరికే సమస్యను గుర్తించే లక్షణాలు వంటపట్టినవి. కొందరు గుర్తించిన సమస్యలకు పరిష్కారం ఏమిటో తెలుపలేని వారు కొందరు పరిష్కారంకూడ చెప్పగల శక్తి కలిగిఉన్నవారు మరి కొందరు. అయితే బహుకొద్ది మంది మాత్రమే పరిష్కారాన్ని శరవేగంతో అమలు జరిపే శక్తి కలవారు ఉన్నారు. ఈ కోవకు చెందిన కొద్ది మందిలో ఒకరు చెన్నారెడ్డి గారు" ఇలాంటి వ్యక్తిని నేను ఆరాధించ కుండా ఉండలేను అని నాయుడమ్మ అన్నారు.

చెన్నారెడ్డి వాదనా పటిమ, ఆయనపట్టుదలను ప్రశంసిస్తూ సుప్రసిద్ధ ఇంజనీర్ భారతప్రభుత్వ నీటి పారుదల వ్యవహారాల మాజీ సలహాదారు శ్రీ మాటూరు గోపాలరావు గారు రాష్ట్రంలో వివిధ నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం విషయంలో చెన్నారెడ్డి నిర్వహించిన పాత్ర గురించి వివరిస్తూ ఒక ఉదాహరణ పేర్కొన్నారు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణాన్ని సత్వరం చేపట్టాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరేందుకు ఒక ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించి ఢిల్లీ వెళ్ళిన చెన్నారెడ్డి తన వెంట ఉన్న బృందంతో ఒప్పందంతో నాటి కేంద్ర నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి శ్రీ హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీంను ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు సి..యం. త్రివేదిని 1980 సంవత్సరం సెప్టెంబరు 20 వతేదీన కలుసుకున్నారు. రాజకీయ దృష్టితో తక్షణం చేపట్టవలసిన పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణానికి ఖర్చుపరంగా ఆచరణ యోగ్యమైనదనీ సాంఘిక ఆర్థిక దృష్టితో చూస్తే వెంటనే ప్రారంభించ తగినదని గట్టిగా వాదించారు. కృష్ణా, గోదావరి జలాల పంపక విషయంలో పొరుగు రాష్ట్రాలు తమ ఆమోదం తెలిపే వరకు ఆంధ్రప్రదేశ్ వేచి ఉండాలని కేంద్రమంత్రి, ప్రణాళికా సంఘం సూచన చేయగా, చెన్నారెడ్డి చేసిన వాదన వారిని ఇరకాటంలో పెట్టి నిరుత్తరులను చేసింది. పంజాబ్ రాష్ట్రంలో, రైతులకు వ్యవసాయానికి లభించే నీటిలో సగం (50 శాతం) కాలువల ద్వారా అందుతుండగా తెలంగాణా, ప్రాంతంలో వ్యవసాయదారులకు కేవలం రెండు శాతం నామమాత్రమే కాలువల ద్వారా లభిస్తున్న విషయాన్నీ పంజాబ్ రాష్ట్రం కంటే తెలంగాణా ప్రాంతంలో అధికమొత్తంలో నదీజలాలు ప్రవహిస్తున్న అంశాన్ని చెన్నారెడ్డి లేవనెత్తాడు. చెన్నారెడ్డి గారి ఈ ఉపమానాలు ముఖ్యమంత్రి సంజీవరెడ్డి పోచంపాడు నిర్మాణం తెలంగాణ ప్రాంతం పట్ల తాము నిర్వహించ వలసిన నైతిక బాధ్యత అని ప్రణాళికా సంఘానికి 1963లో నచ్చచెప్పేందుకు సహాయం చేశాయి.

1964లో శ్రీ సంజీవరెడ్డి రాజీనామా చేసిన అనంతరం ఏర్పడిన కాసుబ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో శ్రీ చెన్నారెడ్డి పరిశ్రమల శాఖను చేపట్టారు. 1967 సాధారణ ఎన్నికలలో తిరిగి నాలుగవ పర్యాయం శాసనసభకు ఎన్నికైన చెన్నారెడ్డి గారికి పరిశ్రమలు ఆర్థికమంత్రిత్వ శాఖ లభించింది. కొంతకాలం

ఆయన విద్యాశాఖామంత్రిగా కూడ పనిచేశారు.పరిశ్రమలశాఖను ఆయన ఒక సాదాసీదా మంత్రిలా కాక ఒక విప్లవకారుడిగా నిర్వహించి ఆమూలాగ్రం కుదిపి వేసి ఆ శాఖను పునర్నిర్మించి కొత్త నిర్వచనం కలిపించారు.

పారిశ్రామిక విస్తరణ కార్యక్రమాన్ని ఉధృతం చేయాలని సంకల్పించిన మంత్రి, మనరాష్ట్రంలో లభించే ముడి పదార్థాలు ఖనిజాలు ఏమిటి వాటి ఆధారంగా ఎక్కడ ఏ పరిశ్రమలు నెలకొల్పవచ్చు, మనరాష్ట్రంలో ఉన్న భారీపరిశ్రమలు, మున్ముందు నెలకొనబోయే భారీపరిశ్రమలకు ఆధారంగా అనుబంధంగా ఉండేందుకు ఎలాంటి పరిశ్రమలు నెలకొల్పవచ్చు అనే అంశంపై శాస్త్రీయ పద్ధతిలో సాంకేతిక వివరాలను ఇతర సమాచారాన్ని పుష్కలంగా సేకరించారు. ఈ బాధ్యత నిర్వహణకు గాను పరిశ్రమల శాఖలో సాంకేతిక విభాగాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేసి చిత్తశుద్ధి, కార్యదక్షత గల అధికారులకు ఆ విభాగాన్ని అప్పగించారు. జిల్లా స్థాయిలోనే కాక వివిధ పట్టణాలలో ఇతర ముఖ్య ప్రాంతాలలో అధికారులు అనధికారులు సాంకేతిక నిపుణులు ఔత్సాహిక పారిశ్రామికుల సదస్సులను సభలను నిర్వహించి ఆ కార్యక్రమాలలో స్వయంగా పాల్గొని సుస్పష్టమైన నిర్ణయాలు ఈ చర్చల వలన రూపుసంతరించుకునేందుకు దోహదం చేశారు. పారిశ్రామిక వాటికలను, సహకార పారిశ్రామిక కేంద్రాలను ఏర్పాటు చేయడం ద్వారా భారతదేశం మొత్తం మీదనే తొలిపర్యాయం ఆయన నూతన ప్రయోగం అమలు చేశారు.

ప్రజల దైనందిన అవసరాలకు కావలసిన ఉత్పత్తులకు సంబంధించి, కేవలం ఎగుమతి చేయదగు వస్తు ఉత్పత్తులకు సంబంధించి, ఉభయతారకం కాగల ఉత్పత్తుల గురించి విడివిడిగా ప్రాజెక్టు నివేదికలు రూపొందించ వలసినదిగా ఆయన పారిశ్రామిక శాఖను ఆదేశించారు. అందుకుగాను ప్రత్యేకంగా సాంకేతిక విభాగాన్ని ఏర్పాటు చేశారు. జిల్లా స్థాయిలో పారిశ్రామిక

కేంద్రాలు ఏర్పాటు చేసి బాధ్యతగల సీనియర్ అధికారులను ఈ కేంద్రాల అధిపతులుగా నియమించి వారికి తగిన అధికారాలు ధారాదత్తం చేశారు. స్థలం, షెడ్స్, నీరు, విద్యుత్ వసతుల కల్పనకు గాను "ఇండస్ట్రియల్ ఇన్ఫ్రాస్ట్రక్చర్" (మౌలికావసరాలు సమకూర్చే) సంస్థను రూపొందించారు, వ్యవసాయోత్పత్తులు ఆధారపరిశ్రమలను ప్రోత్సహించేందుకు స్థాపించేందుకు ఆయన ఎగ్రో ఇండస్ట్రీస్ కార్పొరేషన్ కూడ నెలకొల్పారు.వేగవంతముగా మౌలిక సదుపాయాలు కల్పించడం ద్వారా కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్ప సంకల్పించిన ఐ.డి.పి.యల్. (ఇండియన్ డ్రగ్స్ అండ్ ఫార్మసూటికల్స్) హెచ్.యం.టి. (హిందూస్థాన్ మిషన్ టూల్స్) బి. హెచ్. యి. యల్. (భారత్ హెవీ ఎలక్ట్రికల్స్) వంటి పెద్ద సంస్థలు త్వరితగతిని నెలకొనేందుకు తద్వారా వేలమంది కార్మికులకు వందలమంది సాంకేతిక నిపుణులకు ఉపాధి దొరికేందుకు, పన్నుల ద్వారా రాష్ట్ర ఆదాయం పెరిగేందుకు కృషి చేశారు. పారిశ్రామిక ప్రగతికి సంబంధించినంతవరకు చెన్నారెడ్డి పరిశ్రమల కాలం స్వర్ణయుగమని ఆయనను పలువురు ప్రశంసించారు.

విద్యాశాఖా మంత్రిగా డా॥ చెన్నారెడ్డి సంగీతం, సాహిత్యం, లలితకళలు, నృత్య, నాటిక సినీ రంగాల సర్వతో ముఖాభివృద్ధికి కృషిచేసి, సరికొత్త ఆలోచనా విధానంతో ఆయారంగాల సర్వతో వికాసానికి దోహదకారులైనారు. ఈ సంస్థల కార్య కలాపాలలో నవచైతన్యాన్ని అందుకు సంబంధించిన వారిలో నూతనోత్సాహాన్ని కల్పించి చెన్నారెడ్డి అందరితోశభాష్ అనుపించుకున్నారు. అందువల్లనే వివిధ రంగాల కళాకారులకు, సినీ జనానికి ఆయనంటే అపార అభిమానం.

# 7. కేంద్ర మంత్రి పదవి

రాష్ట్ర విద్య, ఆర్థిక వాణిజ్య పన్నుల శాఖలమంత్రిగా స్వల్పకాలమే పని చేసిన చెన్నారెడ్డి గారు 1967 మార్చినెలలో కేంద్ర ప్రభుత్వం ఉక్కు గనుల శాఖామంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టారు. అంతకు ముందు ఇద్దరు మంత్రులు నిర్వహించిన శాఖలను ఒకటిగా చేసి శ్రీ రెడ్డి గారికి అప్పగించారు. శ్రీమతి గాంధి. 1967 ఏప్రిల్ మాసంలో శాసనసభ సభ్యత్వానికి రాజీనామా చేసిన చెన్నారెడ్డిగారు రాజ్యసభ సభ్యునిగా ఎన్నికైనారు. చెన్నారెడ్డి గారి మంత్రిత్వశాఖ ఆధ్వర్యంలో అతిముఖ్యమైన మూడు భారీ ఉక్కు పరిశ్రమలే కాక బొగ్గు గనులు, దాతువులు మొదలగు విభాగాలు కూడ ఉన్నాయి.

కేంద్ర ఉక్కు, ఇనుము గనులశాఖ మంత్రిగా చెన్నారెడ్డి గారు సాధించిన ఘనకార్యాలలో చెప్పుకోదగిన వాటిలో ఒకటి ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటకలలో ఉక్కు కర్మాగారాల నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వ సూత్రప్రాయ అంగీకారం. ఉక్కు పరిశ్రమలను నూతన ప్రాంతాలలో స్థాపించాలని ఆయన

చేసిన ప్రతిపాదనను కేంద్రమంత్రివర్గం ఆమోదించింది. 1967 అక్టోబర్ మాసంలో ఇంగ్లాండ్ మరికొన్ని దేశాలు పర్యటించి అక్కడ ఉక్కు, ఇనుము పరిశ్రమల పనితీరుపై అధ్యయనం చేసిన రెడ్డిగారు సమర్పించిన ఒక నివేదిక ఆధారంగా జరిగిన కేంద్రమంత్రి వర్గ నిర్ణయ ఫలితంగా దేశంలో ఉక్కు పరిశ్రమ పునర్ వ్యవస్థీకరించబడింది. చెన్నారెడ్డి ఉక్కుశాఖామంత్రిగా ఉన్న కాలంలోనే బొకారో తొలి బ్లాస్టఫర్నెస్ ప్రారంభం కావడం, బొకారో విస్తరణకు చర్చలు మొదలవడం జరిగాయి. ఉక్కుమంత్రిగా చెన్నారెడ్డి సోవియట్ యూనియన్, బ్రిటన్ మరికొన్ని దేశాలు కూడా సందర్శించారు. అత్యల్ప కాలం ఏడాది మాత్రమే రెడ్డిగారు కేంద్రప్రభుత్వంలో ఉన్నా మంత్రిగా వారు చూపిన చొరవ సమర్థత దూరదృష్టి పార్లమెంటులోను బయట అందరి దృష్టి ఆకర్షించింది. లోక్‌సభలో ప్రశ్నోత్తరాలు జరుగుతున్న సమయంలో ఒక రోజున ఒక సభ్యుడు అకస్మాత్తుగా హిందీభాషలో ఒక ప్రశ్న అడిగాడు చెన్నారెడ్డిగారిని అపహాస్యం చేసేందుకు ప్రయత్నించగా విషయం గ్రహించిన మంత్రి స్వచ్ఛమైన హిందీ భాషలోను స్పష్టంగా సమాధానం సభకు చెప్పేసరికి అందరు నిశ్చేష్టితులైనారు. ప్రశ్న అడిగిన సభ్యుడు వెంటనే తన స్థానం నుండి లేచి మంత్రి వద్దకు వెళ్ళి ఆయనను ఆలింగనం చేసి అభినందించగా సభ కరతాళధ్వనులు చేసిన అపూర్వ సంఘటన ఆ రోజుల్లో జరిగింది.

తన ఆధీనంలో పని చేసిన సిబ్బందినీ అధికారులను కుటుంబ సభ్యులులా చూచుకున్న చెన్నారెడ్డి అవిశ్రాంతంగా వారితో పనిచేయించారు. అయినా, ఆయనవారి ప్రేమాభిమానాలను చూరగొన్నారు. కేంద్రంలో మంత్రులను సందర్శించదలచుకున్న అధికారులు అనధికారులకు మంత్రి అదనపు ప్రయివేటు కార్యదర్శి సమయం కేటాయించడం నాడు నేడు ఉన్న ఆచారం. అదనపు ప్రయివేటు కార్యదర్శి తమ మంత్రులను సంప్రదించే ఈ

కార్యభారం నిర్వహిస్తారా లేక స్వతంత్రంగానే అనే విషయం వేరు. ఈ సాంప్రదాయానికి భిన్నంగా చెన్నారెడ్డి తనే స్వయంగా తమను కలుసుకొనదలచిన వారికి తగిన సమయం కేటాయించడం అలవాటు చేసుకున్నారు. శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులకు అవసరమైన సందర్భాలలో అధిక సమయం కేటాయించడం అలవాటుగా పాటించిన చెన్నారెడ్డి సమావేశం తర్వాత వారినుండి లిఖిత పూర్వక నివేదికలు కూడ సేకరించేవారు. ప్రభుత్వంలో మంత్రులు ఉమ్మడి బాధ్యత ప్రజాస్వామ్యంలో మూలసూత్రం కనుక చెన్నారెడ్డి గారు కేవలం తమ శాఖకు సంబంధించిన అంశాలపైననే కాక అనేక ఇతర అంశాలపై కూడ నిపుణులతో చర్చించి వాటిపై స్వంతాలోచన స్పష్టమైన అభిప్రాయాలు కలిగి ఒక కంప్యూటర్‌గా విరాజిల్లే వారు. మంత్రివర్గ చర్చలలో ఏ అంశంపై ఆయన జోక్యం చేసుకున్నా సాధికారికంగా మాట్లాడి ప్రధాన మంత్రి ఇతర మంత్రి వర్గ సహచరులను ఆశ్చర్యచకితులను చేసి వారి ఆదరణ పొందేవారు.

1967 శాసనసభ ఎన్నికలకు సంబంధించి చెన్నారెడ్డి ఎన్నికను సవాలు చేస్తూ దాఖలైన ఒక పిటిషన్‌పై న్యాయస్థానం ఇచ్చిన ఒక తీర్పుకు ప్రతిస్పందిస్తూ చెన్నారెడ్డి కేంద్రంలో తమ పదవికే కాక రాజ్యసభ సభ్యత్వానికి రాజీనామా చేశారు. అసలు ఏమి జరిగినది ఎవరూ అధ్యయనం చేయకమునుపే రెడ్డిగారు వెనుకాముందు ఆలోచించకుండా, పదవిలో కొనసాగే అవకాశాలను కూడ అధ్యయనం చేయకుండా పదవినుండి ఆకస్మికంగా వైదొలగి న్యాయస్థానం పట్ల తమకు ఉన్న అపారగౌరవాన్ని చాటిచెప్పారు.

సాంకేతికకారణాల వల్ల ఆయన ఎన్నిక చెల్లనేరదని కోర్టు తీర్పు చెప్పింది. కోర్టు తీర్పు ప్రతి కొరకు ఎదురు చూడకుండా టెలిఫోన్‌లో ఈ వార్త తెలియగానే చెన్నారెడ్డిగారు పదవిని త్యజించారు. తమపై ఎన్నికల పిటిషన్ వేయించిన తన రాజకీయ ప్రత్యర్థులు రాబోయే ఎన్నికలలో తన పోటీని నివారించేందుకు ఒక పెద్ద కుట్ర పన్నారనే సంగతి

చెన్నారెడ్డికి ఆయన మిత్రులకు ముందుగానే తెలుసు. డా॥చెన్నారెడ్డిని పక్కకు తప్పించగలిగినట్లయితే, 1972 ఎన్నికల అనంతరం రాష్ట్ర నాయకత్వం విషయంలో తమకు గట్టి ప్రత్యర్థులు ఉండబోరని ఈ నాయకులు భావించారు.

కోర్టు తీర్పు వల్లనే తాము కేంద్ర ప్రభుత్వం నుండి వైదొలగిపోతున్నామనే ఆలోచన, ఈ తీర్పు తనకు ఒక మచ్చను, రాజకీయంగా ప్రతిబంధకాన్ని కల్పించగలదనే భావము చెన్నారెడ్డికి ఆందోళనను కానీ, ఆవేదనను కానీ కలిగించలేదు. ఆయన ఈ ఉదంతం అంతటినీ పిలసాఫికల్‌గా - వేదాంత ధోరణిలో, ఖర్మ సిద్ధాంతానుగుణంగా స్వీకరించారు. అందుకు ప్రోదిచేసిన కారణాలలో ఒకటి తనకు వ్యతిరేకంగా తీర్పు వెలువడడానికి దోహదమైన విషయాలు ఆ సందర్భంలో జరిగిన రాజకీయకుట్రలు బాధ్యతాయుత పదవులలో ఉన్న వారు నిర్వహించిన పాత్ర గురించి చెన్నారెడ్డికి క్షుణ్ణమైన అవగాహన ఉండడమే. శాసనసభ ఎన్నికలు జరుగుతున్న సమయంలో జిల్లా పోలీసు, రెవెన్యూ అధికారులుగా ఉన్న వారిని కూడా తన రాజకీయ ప్రత్యర్థులు తనకు ప్రతికూలంగా వాంగ్మూలాలు ఇచ్చేందుకు సంసిద్ధం చేయడంలో సఫలీకృతమైన సంగతీ చెన్నారెడ్డి గారికి తెలుసు. డా. చెన్నారెడ్డిని దెబ్బతీస్తే తెలంగాణా ప్రాంతంలో తమకు ప్రత్యర్థులు ఉండరని శ్రీ బ్రహ్మానందరెడ్డి, అమాయకంగా విశ్వసించిన సంగతి చెన్నారెడ్డికి తెలుసు. ఈ పూర్వరంగం గురించి చెన్నారెడ్డికి పూర్తి అవగాహన ఉండడం వల్లనే ఆయన మనోనిబ్బరాన్ని కోల్పోలేదు. తనకు ప్రతికూల తీర్పు అత్యున్నత న్యాయస్థానం నుండి వెలువడినందున శ్రీ చెన్నారెడ్డి ప్రత్యామ్నాయం గురించీ ఆలోచించలేదు. కారణం ఆయన ఈ ఉదంతం అంతటినీ ఫిలసాపికల్‌గా స్వీకరించారు. నిత్యం వైజ్ఞానిక, వినోద కార్యక్రమాలలో పాల్గొంటూ, తన వ్యవసాయ పనులు చూచుకుంటూ, మిత్రులు, సహచరులకు దర్శనం ఇస్తూ, తీరిక సమయాలలో గ్రంథపఠనం చేస్తూ ఆయన సమయం గడిపారు. అప్పుడుకూడా వారికి కార్యక్రమాలు చేతినిండా వుండేవి.

# 8. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం

1967 ఎన్నికల అనంతరం శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం తెలంగాణా ప్రాంతం పట్ల సవతితల్లి ప్రేమ చూపుతున్నట్లు శాసనసభలోనూ, వెలుపలా తరచూ విమర్శలు జరుగుతుండేవి. ప్రమోషన్స్, బదిలీల విషయంలో అటు ఉద్యోగులు, కళాశాలల్లో ప్రవేశాల విషయంలో విద్యార్థులు కొన్ని ఇబ్బందులకు గురై తమ అసంతృప్తిని బహిర్గతం చేశారు. ప్రాంతీయ సంఘం తరపున పూర్వం చెన్నారెడ్డి సమర్పించిన నివేదికలపై ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, ఆయన ప్రభుత్వం ప్రతిస్పందించినట్లు, బ్రహ్మానందరెడ్డి కానీ ఆయన ప్రభుత్వం కానీ ప్రతిస్పందించక, తెలంగాణా ప్రాంత నాయకులు, ఉద్యోగులు విద్యార్థుల గోడుమ తేలికగా త్రోసిపుచ్చి సమస్యల పరిష్కార చర్యలు గైకొనలేదు. తెలంగాణా మంత్రులు, ప్రభుత్వాన్ని నిగ్గతీసే సాహసం చూపలేకపోవడం అలా ఉంచి ఉద్యోగులు, విద్యార్థుల అసంతృప్తికి అర్థం కూడ పట్టలేక పోయారు.

1968లో ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులు తమ అసంతృప్తి పదేపదే బహిర్గతం చేశారు. జిల్లాల్లో కూడా విద్యార్థులు, ఉద్యోగులు

సమావేశాలు జరిపి తీర్మానాలు చేసి తమకు జరుగుతున్న అన్యాయాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. ఫలితం లేకపోయింది. తెలంగాణా మిగులు నిధులు అనేక కోట్ల రూపాయలు ఇతర ప్రాంతాల అభివృద్ధికి ఖర్చు చేసిన ఉదంతాలు శాసన సభలో ప్రస్తావనకు రాగా ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి తెలంగాణా శాసన సభ్యులను ఎద్దేవా చేస్తూ " పాత కోట్లా, కొత్త కోట్లా" అని సభికులు కొందరిని నవ్వించి చాలా గొప్ప వ్యాఖ్య చేసినట్లు సంతృప్తి పడగా, మెప్పు పొందదల చుకున్న కొందరు సన్నిహిత అనుయాయులు ఆయనను అభినందించారు కూడా. ఈ సంఘటన అనంతరం కొందరు తెలంగాణా నాయకులు ప్రత్యక్షంగా, మరికొందరు పరోక్షంగా విద్యార్థులు ఉద్యోగుల ఉద్యమానికి తమ మద్దతు తెలియజేశారు. వీరిలో అధిక సంఖ్యాకులు డా. చెన్నారెడ్డి అనుయాయులే.

ఈలోగా జలగం వెంగళరావుతో సహా పదవులు దొరకని కొందరు ప్రముఖులు బ్రహ్మానందరెడ్డిని 'బ్లాక్‌మేల్' చేసేందుకు, తెలంగాణ విద్యార్థుల అసంతృప్తిని అవకాశంగా తీసుకున్నారు. తెలంగాణ హక్కుల సాధన ఉద్యమం విద్యార్థులు ప్రారంభించినదరిమిలా, జలగం వెంగళరావు తన కులానికి చెందిన, తన చెప్పుచేతలలో ఉండే ఒక విద్యార్థిచే ఖమ్మం పట్టణంలో నిరాహారదీక్ష ప్రారంభింప చేశారు. ఉద్యమానికి ఉధృత రూపం కల్పించేందుకుగాను అక్కడి ఉద్యోగులలో వెంగళరావు అనుయాయులే పాల్వంచ థర్మల్‌స్టేషన్‌లో ఆంధ్ర ఉద్యోగులను అవమానాలకు దాడులకు గురిచేశారు.

ప్రభుత్వం సమస్య పరిష్కారానికి చిత్తశుద్ధి చూపటానికి బదులు ఒకవైపు విద్యార్థులను విడదీయడానికీ, మరొకవైపు పోలీసులద్వారా బలప్రయోగంతో బెదిరించి అసంతృప్తులను అణచివేసే ప్రయత్నం చేసింది. ఈ ఆలోచన ఎదురు దెబ్బతీసింది. లాఠీఛార్జీలు, భాష్పవాయు ప్రయోగాలు విద్యార్థుల సంకల్పాన్ని మరింత గట్టిపరిచాయి. ఆ దశలో ప్రతిపక్షాల సహాయం పొందిన ప్రభుత్వం

కన్నీటితుడుపుగా కొన్ని చర్యలు తీసుకొనే ప్రయత్నం చేసినా ప్రయోజనం లేకపోయింది. ఉద్యమం ఉధృతమై పల్లెపల్లెకు పాకిపోయింది. ఉక్కుపాదంతో దానిని అణచివేస్తే తప్ప ప్రయోజనం లేదని అపోహపడిన ప్రభుత్వం వేలమంది యువకులను, విద్యార్థులను జైళ్ళలో పెట్టింది. నిషేధాలు, కర్ఫ్యూలు అమలు జరిపి ప్రదర్శనలను, ఊరేగింపులను నిరోధించాలని చేసిన ప్రయత్నాలన్నీ అరచేతిని అడ్డుపెట్టి సూర్యుడు కనపడకుండా చేయాలన్నటు వంటి ప్రయత్నాన్నే ప్రతిబింబించాయి. పరిస్థితి తీవ్రతను గ్రహించిన ముఖ్యమంత్రి అఖిలపక్ష సమావేశం జరిపి తన తాబేదారులుగా ఉన్న తెలంగాణా నాయకుల మద్దతుతో ఒక ఒప్పందాన్ని రూపొందించి కొందరు అసంతృప్తి కాంగ్రెస్ నాయకులతో రాజీ చేసుకున్నారు. అయితే, ఈ ఒప్పందం తర్వాత వెంగళరావు ఖమ్మంలో తన తాబేదారునిచే నిరసన వ్రతాన్ని విరమింపచేశారు తప్ప అది మరింకే ప్రయోజనం జరుగలేదు. చెన్నారెడ్డి గారు పరిస్థితులను ఓపికతో ఆకళింపు చేసుకుంటూ జరుగుతున్న చరిత్రను చూస్తూనే ఉన్నా ఆయన నోరుమెదపలేదు. పదవిలేదు కాబట్టి ఉద్యమకారులను ప్రోత్సహిస్తున్నారనే అప్రతిష్ఠ అధికారంలో ఉన్నవారు తమకు ఆపాదిస్తారని ఆయన భావించి ఉంటారు. అయితే శాసనసభ్యులు తదితరులు చెన్నారెడ్డి మద్దతుకొరకు ప్రయత్నిస్తూనే ఉన్నారు. 1969లో ఫిబ్రవరి-మార్చి మాసాల మధ్య ఉద్యమం ఉధృతం దాల్చింది. విద్యాసంస్థలు మూతపడ్డాయి. జంట నగరాలతో సహా అనేక పట్టణాలలో కర్ఫ్యూ విధించి శాంతిభద్రతల పరిరక్షణ బాధ్యత కొన్ని సందర్భాలలో సైనికుల హస్తగతమైనది. ఏప్రిల్ మాసంలో ప్రభుత్వం వందలమంది నాయకులతో వేలాదిమందిని ప్రభుత్వం జైళ్ళలో నిర్బంధించింది. ఉద్యమానికి నాయకత్వం వహించిన వారందరూ జైలుకు తరలించబడ్డారు. అయితే ఉద్యమం ఆగకపోగా మరింత ఉధృతమైంది. ఆ సమయంలో చర్చల పేరుతో కొందరు నాయకులను

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

ఢిల్లీకి రావలసినదిగా శ్రీమతి గాంధీ పంపిన ఆహ్వానాన్ని నాయకులు నిరాకరించారు. జైళ్ళలో ఉన్నవారినందరినీ మొదలు విడిచిపెడితే తప్ప చర్చలకు ససేమిరా అవకాశం లేదని నాయకులు స్పష్టం చేయడం జరిగింది. ఈ దశలో పలువురు తెలంగాణా ప్రాంత శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు ఉద్యమకారులకు అండగా నిలిచి, ప్రభుత్వాన్ని, అధికారపార్టీని ధిక్కరించటం, వారందరూ ఉద్యమానికి నాయకత్వం వహించవలసిందిగా డా. చెన్నారెడ్డిగారిని కోరడం జరిగింది. అయినప్పటికీ డాక్టర్‌గారు తొందరపడకుండా, వేచి యుండి జైళ్ళలో ఉన్న నాయకులలో ముఖ్యులు, కోర్టుల ఉత్తర్వుల ద్వారానైతేనేమి, మరే కారణాల వల్లనైతేనేమి విడుదలై తమను నాయకుడుగా ఎన్నుకొన్న తరువాతనే ఉద్యమానికి నాయకత్వం వహించి దానికొక రూపు ఇచ్చారు.

అప్పటివరకు తెలంగాణా హక్కుల రక్షణ సమితి పేరుతోను, తెలంగాణా పీపుల్స్ కన్వెన్షన్ పేరుతోనూ ఉద్యమంలో పాల్గొన్న వారందరూ చెన్నారెడ్డి గారి నాయకత్వాన్ని సమర్థించడంతో, ఆయన క్రియాశీల కార్యకర్తలతో విస్తృతసమావేశం జరిపి ఉద్యమానికి ఊపునిచ్చేందుకుగాను తెలంగాణా ప్రజాసమితి పేరుతో ఒక ఫోరం ఏర్పాటుచేశారు. పలువురు చట్టసభ్యులు, మాజీలు పంచాయితీ సంస్థలు, సహకార సంస్థల అధ్యక్షులు, మాజీ ఉన్నతాధికారులు, వివిధ వృత్తులలో పేరుప్రఖ్యాతులు ఆర్జించినవారు తెలంగాణ ప్రజా సమితి క్రియాశీల సభ్యులైనారు. కొన్ని కార్మిక వ్యాపార వృత్తి సంఘాలవారు సైతం ప్రజాసమితికి బాసటను తెలిపారు. అయితే డా. చెన్నారెడ్డిగారు తన పూర్వ రాజకీయ అనుయాయులు కొందరికి హయగ్రీవాచారి, కె.వి.కేశవులు, రామరావు మోచర్ల వంటి వారికి - పదవులు కట్టబెట్టడం విమర్శలకు తావు ఇచ్చింది. సమితికి రెడ్డిగారే అధ్యక్షులుగా ఎన్నికైనారు. ఒక తీర్మానం ద్వారా కార్యవర్గం ఆయనకు పలు అధికారాలు

దాఖలు పరిచింది. తిరుగులేని నాయకుడిగా తెలంగాణా ఉద్యమ రథ సారథ్యాన్ని చెన్నారెడ్డిగారు సునాయాసంగా చేజిక్కించుకునేందుకు దోహదం చేసిన కారణాల్లో కొన్ని ఇక్కడ ఉదహరించడం జరిగింది.

ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ పునఃప్రారంభకుడైన విద్యార్థి నాయకుడు మల్లిఖార్జున్ నిజాయితీ, నిర్భీతితో వ్యవహరించి విద్యార్థులకు తిరుగులేని విశ్వాసపాత్ర నాయకుడిగా కొనసాగటం, అధ్యక్షుడుగా వున్న మదన్‌మోహన్ ప్రలోభాలకు, బెదిరింపులకు, బుజ్జగింపులకు లొంగకపోవడం, ఎస్. వెంకట రామరెడ్డి, ఎం. మాణిక్‌రావు, సి. నర్సిరెడ్డి, జనార్ధన్‌రెడ్డి తెరవెనుక నుండి చేసిన రాజకీయ చాణుక్యం, శ్రీమతి టి.ఎన్. సదాలక్ష్మి, న్యాయవాదులు జి. నారాయణరావు, జగన్మోహనరెడ్డి, కార్మిక నాయకులు బద్రి విశాల్ పిట్టి, జర్నలిస్టు ఎస్.రఘువీరరావు ఇచ్చిపుచ్చుకునే ధోరణికి అంగీకరించడం, అచ్యుతరెడ్డి, కొండా లక్ష్మణబాపూజీ వంటి కాకలుతీరిన రాజకీయ నాయకులు రాజీమార్గానికి తలవంచడం మొదలైన కారణాలు. ఆనాడు, సర్వసైన్యాధిపతి లేకుండానే యుద్ధరంగంలో శరవేగంగా పురోగమనం చేస్తున్న సైనికులకు ఆకస్మాత్తుగా అనుభవజ్ఞుడైన ఒక ఫీల్డ్‌మార్షల్ దొరికినట్టు డా॥ రెడ్డిగారి సమర్థవంతమైన నాయకత్వం లభించింది. అంతర్జాతీయ దృష్టిని ఆకర్షించిన రెండేళ్ళ ఉద్యమానికి రెడ్డిగారి నాయకత్వం ప్రతిష్టను, ప్రాధాన్యతను సమకూర్చిపెట్టింది.

ఆ తరువాత కొంత కాలానికి శ్రీమతి గాంధీ తన మంత్రివర్గ సహచరులను ప్రత్యేక దూతలుగా పంపించి చెన్నారెడ్డితో మంతనాలు జరిపారు. ఆయన ససేమిరా రాజీకి అంగీకరించకపోవడంతో ఉద్యమం ఉధృతమైంది. ఒకనాడు ఉద్యమకారులమీద జరిగిన కాల్పుల్లో అనేకమంది మరణించి కర్ఫ్యూ విధించడంవలన జంటనగరాలు స్మశానంగా తయారైన సందర్భంలో

ఉద్యమకారులు మరీ రెచ్చిపోగలరని భయపడిన శ్రీమతి గాంధీ స్వయంగా అర్ధరాత్రివేళ అకస్మాత్తుగా హైదరాబాద్‌కు హుటాహుటీన వచ్చి ఉద్యమ కారులతో, డా. రెడ్డిగారితో జరిపిన చర్చల వలన ఫలితం లేకపోయింది. కారాగారాలలో మగ్గుతున్న ఉద్యమకారులు అందరినీ మొదట బేషరతుగా విడుదల చేస్తేనే తప్ప ఏరకమైన చర్చలకు ఆస్కారంలేదని చెన్నారెడ్డిగారు స్పష్టం చేశారు. ఆనాడు జంటనగరాలు తెలంగాణా ప్రాంతంలో పెక్కు పట్టణాలు కర్ఫ్యూ క్రింద ఉన్నాయి. ఆనాడు ఇందిరాగాంధీ చుట్టూ ఆవరించి ఉన్న రాజకీయ పరిస్థితి ఆమె ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిపై అసంతృప్తి వ్యక్తపరచడానికి వీలులేకుండా ఉన్నది. ఉద్యమకారుల షరతులు అంగీకరించేందుకు ముఖ్యమంత్రి సంసిద్ధంగా లేరు. ఉద్యమాన్ని అణచివేసేందుకు తమకు మరొక అవకాశం ఇవ్వవలసినదిగా ప్రధానమంత్రిని కోరిన శ్రీ బ్రహ్మానందరెడ్డి, డా. చెన్నారెడ్డి గారితో సహా అగ్రశ్రేణి నాయకులు అందరినీ ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం క్రింద రాజకీయ ఖైదీలుగా జైళ్ళకు పంపగా కొందరు అజ్ఞాతవాసానికి వెళ్ళారు.

నాయకులు జైళ్ళలో ఉన్నా ఉద్యమం కొనసాగింది. ఈలోగా ఢిల్లీలో శ్రీమతి గాంధీకి, మరికొందరు పార్టీ అగ్రనాయకులకు మధ్య తలెత్తిన వివాదాలు పార్టీని చీల్చేస్థాయికి చేరగా తెలంగాణా ప్రాంత ఎఐసిసి సభ్యుల మద్దతు పొందేందుకు శ్రీమతి గాంధీ రాజమండ్రి జైలులో ఉన్న డాక్టర్ గారి వద్దకు రాయబారులను పంపించింది. తెలంగాణా విషయంలో రాజీకి తాను సిద్ధంగా లేకున్నా కాంగ్రెస్ పార్టీకి శ్రీమతి గాంధీ నాయకత్వం విషయంలో మాత్రం తమకు గానీ, తెలంగాణాకు చెందిన ఎఐసిసి సభ్యులకు కానీ ఎటువంటి వ్యతిరేక భావం లేదని డాక్టర్ గారు ఆమెకు స్పష్టంచేశారు. తరువాత కొద్ది రోజులలో శ్రీమతి గాంధీ సలహా, కోర్టు ఆదేశాలమేరకు జైళ్ళలో ఉన్న వారిని

వదలిపెట్టక ప్రభుత్వానికి తప్పలేదు. సమస్యకు పరిష్కారం సాధించేందుకు ఆంధ్ర, తెలంగాణా నాయకులతో ఒకవైపు ప్రధానమంత్రి, మరొకవైపు ఆమె ప్రతినిధులు వివిధ స్థాయిల్లో చర్చలు కొనసాగిస్తున్నదరిమిలా పార్లమెంటు రద్దయి లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు వచ్చాయి.

ఈ ఎన్నికలలో తెలంగాణా ప్రాంతంలోని 14 నియోజకవర్గాలనుండి చెన్నారెడ్డి గారు ప్రజాసమితి అభ్యర్థులను నిలిపారు. భద్రాచలం, ఖమ్మంతో సహా నాలుగు నియోజకవర్గాలలో తప్ప మిగతా పది నియోజకవర్గాలలో ప్రజాసమితి నిలిపిన అభ్యర్థులు ఘనవిజయం సాధించడంతో శ్రీమతి గాంధీకి, తదితరులకు ఉద్యమం సత్తా ఏమిటి, నాయకుడి మద్దతు ఏమిటి, ప్రజలనాడి ఏమిటి తెలిసివచ్చింది.

తరువాత కొనసాగిన చర్చలలో, తెలంగాణా ప్రజల ప్రయోజనాల పరిరక్షణకు వివిధ చర్యలు గైకొనేందుకు, అత్యల్పకాలంలో బ్రహ్మానందరెడ్డిని పదవినుండి వైదొలగించి, తెలంగాణాకు చెందిన నాయకుడిని ఆ పదవిలో నియమించేందుకు శ్రీమతి గాంధీ అంగీకరించడంతో ఉద్యమాన్ని ఆపు చేసేందుకు చెన్నారెడ్డి, పార్లమెంటుకు ఎన్నికైన సభ్యులు అంగీకరించారు. ఈ అంగీకారంమేరకు ప్రజాసమితి తిరిగి కాంగ్రెస్‌లో విలీనమైంది. రెడ్డిగారు ఒప్పందానికి అంగీకరించి తన సమర్థతతో వ్యతిరేక పవనాలను ఎదురొడ్డి శ్రీమతి గాంధీ నాయకత్వం పట్ల విశ్వాసం ప్రకటించడం ద్వారా ఆంధ్రప్రదేశ్ సమగ్రతను పరిరక్షించినవారైనారు. లేకుంటే ఆనాడు రాష్ట్ర విభజన తప్ప వేరే గత్యంతరం లేకపోయెడిదేమో.

# 9. ఉత్తరప్రదేశ్ గవర్నర్ పదవి

1971 సెప్టెంబర్ మాసంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నాయకత్వం మారిన సందర్భంలో చెన్నారెడ్డి గారి ఆమోదంతో శ్రీమతి గాంధీ శ్రీ పి.వి.నరసింహారావుకు నాయకత్వ బాధ్యత అప్పగించారు. 1974లో చెన్నారెడ్డిగారిని ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా నియుక్తులను చేయడం ద్వారా శ్రీమతి గాంధీ వారిపట్ల తమకు ఉన్న గౌరవాన్ని, విశ్వాసాన్ని కాక వారి పాలనాదక్షతపై ఉన్న నమ్మకాన్ని చెప్పకుండానే వెల్లడిచేశారు. డాక్టర్‌గారు ఉత్తరప్రదేశ్ గవర్నర్ పదవీబాధ్యతలు నిర్వహించిన 1974-1977 మధ్యకాలంలో రెండు పర్యాయాలు ఆ రాష్ట్రంలో కేంద్రపాలన విధించబడగా సలహాదారులు లేకుండా ఒంటరిగానే పరిపాలనా బాధ్యతలు నిర్వహించారు. పలువురు మంత్రుల సహాయంతో ముఖ్యమంత్రి నిర్వహించవలసిన బాధ్యతలను, గవర్నర్ బాధ్యతలు ఒకే మనిషి నిర్వహించటం ఆచరణ యోగ్యం, సాధ్యం అయ్యే పనికాదు కనుక సర్వసాధారణంగా పరిపాలనా రంగంలో కాకలుతీరిన వారిని గవర్నర్ సలహాదారులుగా నియమించడం, వారితో గవర్నర్ తన పని భారాన్ని బాధ్యతలను పంచుకోవడం

సాంప్రదాయం. అయితే, చెన్నారెడ్డి గారి విషయంలో కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రపతి ఈ సాంప్రదాయాన్ని తుంగలో తొక్కి సంపూర్ణ బాధ్యతను చెన్నారెడ్డి భుజ స్కంధాలపై వేశారు. అతి విశాల రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్‌లో 54 జిల్లాలలో ఆయన ఒకటి కంటే ఎక్కువసార్లు విస్తృతంగా పర్యటించి చరిత్ర సృష్టించారు.

గవర్నర్ పదవీబాధ్యతలు స్వీకరించిన నాటినుండే చెన్నారెడ్డి ఆ రాష్ట్రానికి సంబంధించిన సమస్యలను, విశాలమైన ఆ రాష్ట్రంలో భిన్న ప్రాంతాలలో సాంప్రదాయాలు, ఆచారాలు, అలవాట్లు పూర్తిగా అధ్యయనం చేశారు. అంతకుముందు ఆ రాష్ట్ర గవర్నర్లుగా పనిచేసినవారందరూ చేసిన పర్యటనల కంటే ఎక్కువ పర్యటనలు చేసిన చెన్నారెడ్డి ఉత్తరప్రదేశ్‌లో ఏ పట్టణం, పల్లె ఎక్కడున్నాయి, అక్కడి జనాభా తీరుతెన్నులు, వారి సమస్యల గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేశారు.

మంత్రి మండలి ఉన్నా, పర్యటనలకు వెళ్ళినప్పుడు ఆయన తన దృష్టికి పరిశీలనకు వచ్చిన అన్ని విషయాలను విని మరచిపోక ప్రతి విషయం తమకు గుర్తుండేందుకు గాను ప్రజలు లేవనెత్తిన సమస్యలను ఒక మామూలు గుమాస్తావలెనో, లేక పత్రికా విలేఖరి వలెనో నోట్‌బుక్‌లో రికార్డు చేసుకునే సాంప్రదాయం పాటించారు. రాజధానికి తిరిగి రాగానే ముఖ్యమంత్రికి వివిధ అంశాలకు సంబంధించి నోట్ పంపించేవారు. ఆ నోటుపై ప్రభుత్వం గైకొన్న చర్య ఏమిటో కూడా విధిగా తమకు తెలపాలనీ, రాష్ట్ర అధిపతికి తమ ఇబ్బందులు తెలుపుకునే హక్కు ప్రజలకు ఉన్నట్లే, వాటి పరిష్కారానికి దోహదం చేయవలసిన బాధ్యత గవర్నర్‌కు ఉన్నదని ఆయన ప్రభుత్వానికి స్పష్టంచేశారు. వేలాదిమంది మాజీ సైనికులు, వారి కుటుంబాలకు పునరావాసం కల్పించి వారికి వ్యవసాయ భూమి సమకూర్చే విషయంలో చెన్నారెడ్డి చూపిన చొరవ, దక్షతను నాటి రాష్ట్రపతి శ్రీ వి.వి.గిరి ఎంతగానో కొనియాడారు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

ఆస్పత్రులలో చేరిన నిరుపేద రోగులు కూడా వారికి అవసరమైన సందర్భాలలో రక్తం కొనుగోలు చేయవలసి వస్తున్నదని తెలుసుకొని అనేక ప్రైవేట్ సేవాసంస్థలకు ప్రేరణ కల్పించి వారు ఉచితంగా సరఫరా చేసేందుకు రక్తపు బ్యాంకులు ఏర్పాటుచేసేందుకు కారకులైనారు. శాంతిభద్రతల పరిరక్షణకు నిత్యావసర సరుకులు ధరలు తగ్గించేందుకు గవర్నర్ చెన్నారెడ్డి గైకొన్న చర్యలు ఆ రాష్ట్ర ప్రజ ఆయనను ఆరాధించేందుకు దోహదమయ్యాయి. బాలల సర్వతోముఖ వికాసానికి కంకణం ధరించడం ప్రభుత్వంతో అయ్యే పని కాదని గ్రహించిన చెన్నారెడ్డి గారు ఈ రంగంలో గణనీయపాత్ర నిర్వహించేందుకు రాష్ట్రమంతటా బాలభవన్‌ల ఏర్పాటుకు కృషి చేశారు. హిందూ దేవాదాయ ధర్మాదాయ చట్టం ఉత్తరప్రదేశ్‌కు చెన్నారెడ్డి ప్రసాదించిన శాశ్వత కానుక. ఆ రాష్ట్రంలో దేవాలయాలు, మఠాలు, ధర్మసంస్థలు లక్షల సంఖ్యలో ఉన్నప్పటికీ వాటి కార్యక్రమాలు క్రమబద్ధం చేసేందుకు నియమ నిబంధనలు కానీ, వాటిపై అజమాయిషీ చేసేందుకు ప్రభుత్వానికి అధికారాలు కానీ లేకుండెను. అందువల్ల దేవాలయాలను, ధర్మసంస్థలను వ్యక్తిగతంగాను, పాలనాసంఘం వ్యక్తులే పేరుతో నిర్వహించేవారు. తమ ఇష్టారాజ్యం చెలాయించి, భక్తుల కష్టనష్టాలను ఖాతరుచేసే వారు కాదు. దైవభీతి, మతవిశ్వాసం కల వారిని మఠాధిపతులు, ఆలయ నిర్వాహకులు, పాండాలు అని పిలువబడే అర్చకులు నిలువుదోపిడీకి గురిచేసి, బెదిరింపులతో భయకంపితులను చేసేవారు.

గవర్నర్‌గా వెళ్ళిన అనంతరం విశ్వనాథుని సమక్షంలో శివరాత్రి పండుగ గడిపేందుకు చెన్నారెడ్డి గారు కాశీ వెళ్ళడం జరిగింది. అధికార పర్యటనపై గవర్నర్ వస్తున్నారని తెలిసి కూడా పారిశుధ్య విషయంలో కానీ, క్రమశిక్షణ పాటించవలసిన విషయంలో కానీ ఆలయ నిర్వాహకులు గణనీయమైన ఏ చర్యా గైకొనలేదు. వారికి ఆ ఆలోచన రాలేదు కూడాను.

గుడి పరిసరాలను, మరుగు లేకుండా స్త్రీ, పురుషులు గంగా స్నానం చేస్తున్న తీరును, గుడిలో అర్చకుల ఆగడాలను స్వయంగా చూచిన గవర్నర్ నిశ్చేష్టులైపోయారు. అర్చకులు ఇవ్వచూపిన తీర్థం పుచ్చుకునేందుకు కూడా మనస్కరించనట్టి జుగుప్సాభావం ఆయనలో కలిగాయి. విశ్వేశ్వరుని చుట్టూ, ఆయన సమక్షంలో జరిగే ఘోరకలిని తక్షణం ఆపుచేయాలనే సంకల్పం చెన్నారెడ్డికి కలిగింది. లక్నో చేరగానే ఆయన ముఖ్యమంత్రితో చర్చలు జరిపి దేవాదాయ ధర్మాదాయ చట్టం తేవలసిన అవసరం గురించి వివరించారు. దక్షిణాది రాష్ట్రాలు ఈ విషయంలో రూపొందించి అమలు జరుపుతున్న చట్టాల గురించి కూడా ముఖ్యమంత్రికి గవర్నర్ వివరించడంతో చట్టం రూపొందించ డానికి చర్యలు ప్రారంభమైనాయి. వివిధ చట్టాలను అధ్యయనం చేసేందుకు అనధికారులు, అధికారులను ప్రభుత్వం పురమాయించింది. ఉత్తరప్రదేశ్ అవసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా ఒక శాసనాన్ని రచించి మొదట ఆర్డినెన్స్ ద్వారా దానిని అమలు జరుపడం ఆ తర్వాత శాసనసభ ఆమోదం పొంది దానిని శాసనం చేయడం జరిగింది.

ఈ బృహత్తర కార్యక్రమంలో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాధికారులకు తోడ్పడేందుకు హైదరాబాదు నుండి దేవాదాయ ధర్మాదాయ శాఖ మాజీ కమిషనర్ కొండపల్లి వాసుదేవరావును మరికొందరు హైందవధర్మ సాంప్రదా యాలు తెలిసిన వారికి ఈ అంశాలపై న్యాయనిష్ణాతులను తమ ప్రభుత్వంచే ఆహ్వానింప చేశారు.

ఉర్దూ, హిందీ భాషలలో ప్రావీణ్యం చెన్నారెడ్డికి ఈ రాష్ట్రంలో ఎంతగానో ఉపకరించగా, మహమ్మదీయుల సంస్కృతి, సాంప్రదాయాలపై ఆయనకు ఉన్న అవగాహన మైనార్టీ వర్గాలను కూడా గవర్నర్‌కు సమీపం చేశాయి. అయితే 1975-77 అత్యవసర కాలంలో కీలక పదవులలో ఉన్న అనేకమంది

వివాదగ్రస్తులు అవగా చెన్నారెడ్డి మాత్రం ఏ వివాదంలోనూ ఇరుక్కోనకపోవడం విశేషం. అయితే 1977లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ, శ్రీమతి గాంధీ అపజయం పొందడం, జనతా ప్రభుత్వం కేంద్రంలో అధికారంలోనికి రావటం వంటి చరిత్రాత్మక పరిణామాలు జరిగిన సమయంలోకూడా చెన్నారెడ్డి ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గానే ఉన్నారు. పదవీబాధ్యతరీత్యా తమ పరిధిలోనికి రాని విషయాలలోను, రాజకీయాలలోను చెన్నారెడ్డి గారు తలదూర్చలేదు. అందువల్లనే మొరార్జీ ప్రభుత్వంతోకూడా ఆయన సంబంధాలు బాగానే కొనసాగాయి.

# 10. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిత్వం

జనతాపార్టీ ప్రభుత్వం ఏర్పడిన ఆరునెలలకు, అక్టోబర్ 1977లో క్రియాశీల రాజకీయాలలో ప్రవేశించాలనే సంకల్పంతో చెన్నారెడ్డి ఉత్తరప్రదేశ్ గవర్నర్ పదవికి రాజీనామా చేసి ఆ తరువాత ఆరు నెలలు తిరుగకమునుపే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పదవీబాధ్యతలు చేపట్టారు. 1974లో చెన్నారెడ్డిగారు ఉత్తరప్రదేశ్ గవర్నర్ బాధ్యతలు స్వీకరించేందుకు అంగీకరించినపుడు ఆయన రాజకీయ జీవితం పరిసమాప్తమైందని భావించినవారు 1978 జనవరిలో ఆయన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక కావటంతో ఆశ్చర్యపోయారు. అయితే ఆ తరువాత మూడునెలలకే ఆయన ఎన్నికల్లో తన పార్టీకి అఖండ విజయం సాధించి మార్చి 3వ తేదీన ముఖ్యమంత్రి కావడంతో నిశ్చేష్టులైనారు.

కాంగ్రెస్ పార్టీ చీలిక వలన ఆవిర్భవించిన కాంగ్రెస్ (ఇందిర) ఆంధ్ర ప్రదేశ్‌లో పటిష్టమైన పునాదులు వేయటంలో చెన్నారెడ్డి ప్రదర్శించిన దూరదృష్టి, సమర్థత ఎంతో కొనియాడదగినవి. అప్పుడు అధికారంలో ఉన్న ముఖ్యమంత్రి

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

జలగం వెంగళరావు మరియు ఇందిరా ప్రత్యర్ధి కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్న మరొక మాజీ ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి అనుచర గణాన్ని ఎదురొడ్డి నిలవడం మామూలు విషయం కాదు. అందునా పార్టీ నిర్మాణానికే కాక ఎన్నికల బరిలో దిగేందుకు వనరులు సమీకరించుకొనడం సామాన్య విషయం కాదు. ఈ మహాయజ్ఞంలో తెలంగాణా ప్రాంతంలో జి.రాజారామ్, యం.మానిక్‌రావు, సి.జగన్నాధరావు ప్రభృతులు, కోస్తా ప్రాంతంలో నాదెండ్ల భాస్కరరావు, ద్రోణంరాజు సత్యనారాయణ, భవనం వెంకట్రాం, రాయలసీమ ప్రాంతంలో శ్రీ అమరనాధరెడ్డి, కె.యి.కృష్ణమూర్తి ప్రభృతులు చెన్నారెడ్డిగారికి కొండంత అండ సమకూర్చి అభ్యర్థుల ఎంపికలో ప్రముఖపాత్ర నిర్వహించారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఇందిరా కాంగ్రెస్‌ను నామరూపాలు లేకుండా అణచివేసేందుకు ముఖ్యమంత్రి వెంగళరావు ఎన్నో అడ్డదోవలు తొక్కి అక్ర మాలకు పాల్పడి అసభ్యంగా ముఖ్యమంత్రి పదవి నిర్వహించే వ్యక్తి హోదాకు తగని విధంగా వ్యవహరించారు. ఆనాడు కె.విజయభాస్కరరెడ్డి, కె.రోశయ్య ప్రభృతులు కూడా బ్రహ్మానందరెడ్డి ఛత్రచ్ఛాయలోనే ఉండి రెడ్డిగారిని శ్రీమతి గాంధీని చాలా పరుషంగా విమర్శించారు - దూషించారు. తుఫాను బాధితులను పరామర్శించేందుకుగాను శ్రీమతి గాంధీ విజయవాడ సందర్శించగా, ప్రభుత్వ అతిధిగృహంలో ఆమె బసచేసేందుకు కానీ, చివరకు 'టాయిలెట్', 'బాత్‌రూం' ఉపయోగించుకునేందుకు కూడా వెంగళరావు అనుమతి లేదని అధికారులు వివరించారు. శ్రీమతి గాంధీ పర్యటనలో ఆమె వెంట వెళ్ళిన డా॥ చెన్నారెడ్డి, జి. రాజారామ్, మాణిక్‌రావ్, నాదెండ్ల భాస్కరరావు, కె.కేశవరావు, పాలడుగు వెంకటరావు ప్రభృతులు ప్రభుత్వ వైఖరికి వెంగళరావు నీచ ప్రవృత్తికి నిరసన తెలిపి ఆమెను వేరే బసకు మార్చారు.

చెన్నారెడ్డి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికవడం ఆ పదవిపై ఆశ

ఉన్న కొందరికి అయిష్టంగానే ఉన్నప్పటికీ, నాటి పరిస్థితులలో పార్టీని ఎన్నికలకు సిద్ధం చేయగలమనే నమ్మకం ఆయన ప్రత్యర్థులు ఎవరికీ లేకుండెను. నాటి శ్రీమతి గాంధీ వ్యతిరేక ముఖ్యమంత్రి జలగం వెంగళరావుతో తలపడేందుకు చెన్నారెడ్డిగారు తప్ప ఏ నాయకుడూ సాహసించలేకపోయారు. ఈ పూర్వరంగంలో చెన్నారెడ్డి గారు ముఖ్యమంత్రిగా అధికారం చేపట్టగానే పార్టీ వెలుపలనే కాక తన పార్టీలోనే రాజకీయ శత్రువులు సిద్ధంగా ఉండిపోయారు.

ఈ విషయం మనస్సులో ఉన్న చెన్నారెడ్డిగారు "ఎవరు ఏమన్నా, ఎన్ని విమర్శలు చేసినా అందరినీ కలుపుకోవాలన్నదే నా ప్రయత్నం; కేవలం రాష్ట్ర అభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని దానిని సాధించేందుకు సహనంతో అందరినీ కలుపుకొని పోవాలని నేను అనుకుంటున్నాను. పదవులు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి. అయితే పదవిలో ఉండగా పదిమందికి ఉపయోగపడే పని చేయాలన్నదే నా ఉద్దేశ్యం. ఎవరినో సాధించి చరిత్ర సృష్టించాలని నేను ఎప్పుడూ ఆలోచించను. అలాంటి చరిత్ర ఎవరికి గుర్తుంటుంది? అందుకే అలాంటి చరిత్రపై నాకు విశ్వాసం లేదు" అన్నారు.

పదవి చేపట్టినప్పటినుండి నిరుపేద ప్రజల ప్రాథమిక అవసరాలు తిండి, బట్ట, గుడిసె ఏర్పడాలన్న సంకల్పంతో పట్టుదలగా పనిచేశారు. హరిజనులు, గిరిజనులు, వెనుకబడిన వర్గాల పట్ల ఆయనకు అపారమైన సానుభూతి ఉన్నదని చెప్పేందుకు ఆయన రూపొందించిన పథకాలనే తార్కాణంగా పేర్కొనవచ్చును. ఆయన ఆలోచనా విధానాలలో బడుగువర్గాలకు మేలు చేయాలనే ఆర్తి అనుక్షణం కనిపిస్తూ ఉంటుంది. వెనుకబడిన వర్గాలవారికి ఉద్యోగాలలో, విద్యా విషయంలో కల్పించిన రిజర్వేషన్ సౌకర్యానికి కాలదోషం పట్టనున్న సమయంలో ఆ సదుపాయాన్ని రెడ్డిగారు దశాబ్దకాలం పెంచారు.

సన్నకారు రైతుల సాధకబాధకాలు ఆయనకు తెలియనవి కావు కనుకనే రెండున్నర ఎకరాలలోపు మాగాణి, అయిదెకరాలకు మించకుండా మెట్టపొలం ఉన్న రైతులందరికీ ఆయన భూమిశిస్తు రద్దుచేశారు.

పేదరైతులకు 1978లో ఏర్పడిన చెన్నారెడ్డి ప్రభుత్వం పంచినంత బంజరుభూమిని ఏ ప్రభుత్వమూ పంచిపెట్టటం జరుగలేదు. అలాగే పేదలకు గృహకల్పన విషయంలో కూడా ఆయన ప్రభుత్వమే అధికసంఖ్యలో నివాసాలను నిర్మించి ఇచ్చింది. నిరుద్యోగులకు శిక్షణా ఉపాధి పథకాలు ఎన్నో రూపొందించారు. వాటిలో నేటికీ చెప్పుకోతగినది " సెట్విన్".

పెరిగిపోతున్న నగరాలలో నివేశనాస్థలాల కొనుగోలు తలకుమించిన భారంగా తయారైన విషయాన్ని దృష్టిలో ఉంచుకొని ఎన్నో సహకార గృహ నిర్మాణ సంస్థలను ఆదుకొని ప్రోత్సహించి చౌకధరకు ప్రభుత్వ భూముల పట్టా ఇప్పించిన చెన్నారెడ్డిగారు, జర్నలిస్టుల రెండవ కాలనీకి, సినీ కళాకారుల కాలనీకి, శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యుల గృహనిర్మాణానికి సరసధరకు జూబ్లీహిల్స్ లో స్థలం కేటాయించారు.

జాతీయ వార్తాసంస్థలైన పి.టి.ఐ, యు.ఎన్.ఐ కార్యాలయ భవనాల నిర్మాణానికి నగర నడిబొడ్డులో ఎ.సి.గార్డ్స్ ప్రాంతంలో చౌకధరకు స్థలం కేటాయించారు. తాము నిర్మించుకున్న భవనాలలో కొంత భాగం అద్దెకు ఇవ్వడం ద్వారా ఈ వార్తాసంస్థలు క్రమం తప్పకుండా కొంత ఆదాయాన్ని నేటికీ పొందుతున్నాయి.

ప్రతి గ్రామానికొక బస్సు, ప్రతి ఇంటికొక దీపం అని నినదించి అనేక మారుమూల గ్రామాలకు రవాణా సౌకర్యం కల్పించిన చెన్నారెడ్డి పెక్కు కుగ్రామాలకు ముఖ్యంగా దళితవాడలకు విద్యుచ్ఛక్తి సమకూర్చారు. రాష్ట్రానికి

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

శాశ్వతంగా మేలు జరుగగల విశాఖ ఉక్కు కర్మాగారం నిర్మాణానికి కేం( ప్రభుత్వం అనుమతి, నాటి కేంద్ర, ఉక్కు శాఖమంత్రి బిజూపట్నాయక్ గా సహాయంతో చెన్నారెడ్డి గారే సాధించి నిర్మాణపనులు ప్రారంభించారు. పోచంపాడు ప్రాజెక్టు కాలువల త్రవ్వకం పనికి కొంత ధనం కేటాయించి ఆ కార్యక్రమం వేగతరం అయ్యేట్టు చేసింది ఆయనే. అయితే 1967వ సంవత్సరంలో కేంద్ర ఉక్కు గనుల శాఖ మంత్రిగా ఉన్న సమయంలో, రేవు పట్టణాలలో ఉక్కు కేంద్ర కర్మాగారాల నిర్మాణానికి కేంద్ర మంత్రివర్గాన్ని అంగీకరింపచేసి ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలో ఉక్కు కర్మాగారాల ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది చెన్నారెడ్డిగారే.

ప్రైవేట్ బస్ ఆపరేటర్ల అగడాలనుండి ప్రయాణీకులకు ముక్తి కల్పించేందుకు విశాఖపట్నంలో బస్‌రూట్లను జాతీయం చేసి, పరిపాలనా పరంగా, హైదరాబాద్ జిల్లాలో దూరప్రాంత ప్రజల ఇబ్బందులు తొలగించేం దుకు రంగారెడ్డి జిల్లాను ఏర్పాటు చేసినదీ రెడ్డిగారి ప్రభుత్వమే. పంచాయితీ ఎన్నికలను పార్టీ రహితంగా జరిపించాలనే నిర్ణయం గైకొన్నది, స్థానిక సంస్థల్లో పంచాయితీల్లో ఓటింగ్‌లో పాల్గొనేవారి కనీస వయః పరిమితిని 21 సంవత్సరాల నుండి 18 సంవత్సరాలకు తగ్గించాలనే నిర్ణయమూ డాక్టర్ రెడ్డిగారే గైకొన్నారు.

ప్రాథమిక పాఠశాలలో విద్యార్థులకు ఉచితంగా స్కూల్‌డ్రస్ సమకూర్చి పుస్తకాలు ఉచితంగా ఇవ్వాలనికూడా చెన్నారెడ్డి ప్రభుత్వం నిర్ణయించింది. విద్యాసంస్థలు, ప్రభుత్వ కార్యక్రమాల పని సమయాన్ని మార్చి ఉదయం ఏడుగంటల నుండి మధ్యాహ్నం ఒంటి గంట వరకు పనివేళలుగా నిర్ణ యించారు. ఈ మార్పువల్ల మధ్యాహ్నం హోంవర్క్ చేసుకునేందుకు విద్యా ర్థులకు, ఇంటిపనులు చూచుకునేందుకు ఉద్యోగులకు సమయం దొరుకు తుందని ఆయన భావించారు. ఉద్యోగుల పదవీ విరమణ వయస్సును 55

సంవత్సరాలనుండి 58 సంవత్సరాలకు పెంచి వారి జీతభత్యాలు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు లభించే మొత్తంతో సమానంచేశారు. కృష్ణా జలాలను మద్రాస్ నగర మంచినీటి అవసరాలకు తరలించే ఒప్పందంపై తమిళనాడు ముఖ్య మంత్రి కరుణానిధితో ఒక ఒప్పందంపై 1978 జూన్ 15వ తేదీన తొలుత సంత కాలు చేసింది శ్రీ చెన్నారెడ్డి గారే.

రాష్ట్రంలో ఎలక్ట్రానిక్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఏర్పాటుచేయాలని, వైద్య విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాలనికూడా చెన్నారెడ్డి ప్రభుత్వం నిర్ణయిం చింది. ఆర్థిక వనరుల పంపకం విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సంబంధాలు పునర్నిర్వచించబడాలనే పిలుపును మొదటగా ఇచ్చినవారు చెన్నా రెడ్డిగారే. ఆయన ఏ నిర్ణయం తీసుకున్నా వెనుకాముందూ ఆలోచించి ప్రజా స్వామ్య పద్ధతిలో మంత్రివర్గ సభ్యులను సంప్రదించి తీసుకునేవారు. అందుకే ఆయన వారానికొకసారి మంత్రివర్గ సమావేశం విధిగా ఏర్పాటుచేసేవారు. మంత్రివర్గం ఏమి నిర్ణయిస్తుందా అని ప్రజలు ఎదురు చూచేవారు.

1977లో అధికారం కోల్పోయి అనేక ఇబ్బందులకు గురైన సందర్భంలో పార్టీ నిర్వహణకు నిధుల కొరకు కర్నాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్ మరికొందరు నాయకులపై శ్రీమతి గాంధీ ఆధారపడింది. 1978లో చెన్నారెడ్డి గారు ముఖ్యమంత్రి పదవి చేపట్టేనాటికి పార్టీ మళ్లీ చీలి, తరువాతి రోజుల్లో ఆమె దేవరాజ్ అర్స్‌కు కూడా దూరమవ్వడం జరిగింది. ఢిల్లీలో పార్టీ నిర్వహణకు, శ్రీమతి గాంధీ, శ్రీ సంజయ్ గాంధీ మరి కొందరు నాయకులు ఎదుర్కొంటున్న కేసుల బాపతు ఖర్చులకు నిధులు సమకూర్చవలసిన బాధ్యత అంతా చెన్నారెడ్డిపై పడడంతో ఆయనకు ఇబ్బందులు మొదలైనాయి.

ఈ నిధుల వసూళ్ళను గోరంతలు కొండంతలు చేసిన అసమ్మతివాదులు చెన్నారెడ్డిని అప్రతిష్ఠపాలుచేశారు. 1979లో ఒక పర్యాయం నేను ఢిల్లీలో

ఉండగా, సమాచార భారతి వార్తా సంస్థ పనిమీద కొద్ది రోజుల అనంతర నేను హైదరాబాద్ నుండి బెంగుళూరు వెళ్లి కర్నాటక ముఖ్యమంత్రిని కలుసు కొనవలసిన కార్యక్రమం రూపొందింది. నేను హైదరాబాదు తిరిగి వచ్చిన మర్నాడే నాకు "ఆపరేషన్స్ రిసెర్చి గ్రూప్" అధ్యక్షులుగా ఉన్న డాక్టర్. యన్.భాస్కరరావు గారు టెలిఫోన్ చేసి ఆ మర్నాడే ఉదయమే నేను బెంగుళూరు వెళ్లడం మంచిదని సూచించారు. మరి ముఖ్యమంత్రితో అపాయింమెంట్ విషయం తనకు వదలమన్నారు. గంట వెనకా ముందుగా ముఖ్యమంత్రి తో అపాయింట్‌మెంట్ ఏర్పాటు చేస్తామన్నారు.

విశేషమేమిటని ప్రశ్నించగా మర్నాడు ఉదయం విమానంలో శ్రీమతి గాంధి ఢిల్లీ నుండి బెంగుళూరు వెళుతున్నందున విమాన ప్రయాణంలో ఆమెతో మాట్లాడే అవకాశం దొరకగలదని ఆమె వెంట వ్యక్తిగత సిబ్బందితో మాకు పరిచయం ఉన్న వ్యక్తి ఉంటారని చెప్పారు.

హైదరాబాద్ విమానాశ్రయంలో ఆగినపుడు శ్రీమతి గాంధీకి చెన్నారెడ్డి అనుకూల, ప్రతికూల నాయకుల వినతి పత్రాలు సమర్పించారు. విమానం బయలదేరిన పది నిమిషాల లోపలనే ఆ కాయితాలన్నీ ఆమె చదివారు. తలపక్కకు తిప్పేసరికి అక్కడ నిల్చొన్న నేను నమస్కారం చేశాను. నేను కలిసే సంగతి ముందుగానే ఆమెకు తెలుసునా అనే అనుమానం కలిగేట్టు ఆమె నన్ను కూర్చొనవలసినదిగా సైగచేశారు. ఒక చివరి సీటులో శ్రీమతి గాంధీగారు మధ్యసీటులో ఆమె బ్యాగ్, కాయితాలు ఉండగా నేను మూడవసీటులో కూర్చున్నాను. "క్యాహోరహాహై ఆప్‌కా ఆంధ్రప్రదేశ్ మే రెడ్డి సాబ్ క్యాకర్‌రహేహై ' (ఆంధ్రప్రదేశ్‌లో ఏం జరుగుతున్నది రెడ్డిగారు ఏమంటున్నారని) ఆమె నన్ను ప్రశ్నించారు. పదిహేను నిమిషాలు సంభాషణల దరిమిలా ఆమె నన్ను సూటిగా ఒక ప్రశ్న అడిగారు. "చెన్నారెడ్డి చాలా డబ్బు వసూలు చేశారట నిజమేనా"

అని. చందాలు వసూలు చేసే అవకాశాలు ఉన్న శాఖలను నిర్వహిస్తున్న కొందరు మంత్రులే ఒకరితో ఒకరు పోటీపడి ముఖ్యమంత్రికి తెలియకుండా సరాసరి ఢిల్లీకే డబ్బు పంపిస్తున్నట్టు నాకు తెలిసినదనీ, ఉదాహరణకు నాటి పౌర సరఫరాల శాఖ మంత్రి గోకా రామస్వామి సలహా మేరకు బియ్యం మిల్లుల యజమానులు లక్షల రూపాయలు ఢిల్లీలో చెల్లించినట్లు తెలిసినదనీ, చెన్నారెడ్డి వసూలు చేసిన చందాలు ఇద్దరు పార్లమెంట్ సభ్యుల ద్వారా ఢిల్లీ పంపినట్లు తెలిసినదనీ నేను చెప్పడంతో ఆమె నిర్విణ్ణురాలైపోయింది.

ఆమె నన్ను అడిగిన తీరును బట్టి చెన్నారెడ్డి గారిని ఆయన ప్రత్యర్థులు పని కట్టుకొని అప్రతిష్ఠపాలు చేసే కృషి చేస్తున్నారని నాకు అర్థమైంది. అంటే ఆమెకు చెన్నారెడ్డి సమకూర్చిన నిధుల కంటే ఎంతోపెద్దమొత్తంలో ఆయన చందాలు వసూలు చేశారని ఆమెకు వారు తెలియజేశారు. ఆమెకు, తనపై తన కొడుకు సంజయ్‌గాంధీపై వున్న కేసులు ఎదుర్కొనేందుకు, పార్టీ నిర్వహణకు పెద్దమొత్తంలో డబ్బు అవసరముందని ఆమె తీసిన ఆరాలను బట్టి నాకు అర్థమైంది. ఆర్థిక స్థోమతగల మంత్రుల గురించి మా చర్చల్లో శ్రీ నాదెండ్ల భాస్కరరావుగారి పేరు ప్రధానంగా ప్రస్తావనకు వచ్చింది. అయితే తనను కలుసుకునేందుకు భాస్కరరావుగారిని ఢిల్లీ పంపే బాధ్యత ఆమె నాకే అప్పగించారు. నా సూచన మేరకు ఢిల్లీ వెళ్లిన శ్రీ నాదెండ్ల, కృష్ణాజిల్లాకే చెందిన రాజకీయేతర ప్రముఖుడు ఒకరిని ఢిల్లీలో కలుసుకుని ఆ తరువాత సంజయ్‌గాంధీని, శ్రీమతి గాంధీని కలుసుకున్నారు. తల్లి, కుమారునితో ఆయనకు సన్నిహిత సత్సంబంధాలు ఏర్పడ్డాయి. అది వేరే కథ.

తనపై జరిగిన దుష్ప్రచారం గురించి చెన్నారెడ్డిగారికి కూడా అవగాహన ఉండడంవల్లనే ఆయన సాహసంగా ఒక బహిరంగ సభలోనే ఈ విషయం ప్రస్తావించారు. "నన్ను చందాలరెడ్డి అని కొందరు అంటున్నారని నాకు తెలుసు,

నా చందాల వలనే ఇందిరా కాంగ్రెస్ బ్రతికి బట్టకట్టగలిగింది. అధికారంలోకి వచ్చి భారతదేశాన్ని పరిపాలిస్తున్నది" అని అః సహాయం లేకుండా 1980 ఎన్నికలలో మెజారిటీ వచ్చేది కాదేమో!!

1979 జనవరి మాసంలో ఆయన షష్టిపూర్తి ఉత్సవాలు ఘనంగా జరిపి చెన్నారెడ్డి దంపతులను వారి అభిమానులు చాలా పెద్ద ఎత్తున సన్మానించారు. భారీ వ్యయంతో కూడిన ఉత్సవాల వలన ఉపకారం కంటే అపకారం అధికంగా ఉండగలదని రెడ్డిగారి మంత్రివర్గ సహచరులలో భవనం వెంకట్రాం మరొకరిద్దరు భావించారు. ఉత్సవాలకు అనుకూలురు అయిన జనార్ధనరెడ్డి, హాషీం ప్రభృతులు మైనారిటీ అభిప్రాయాన్ని త్రోసిపుచ్చడమే కాక భారీ ఉత్సవాలు వద్దు అన్నవారిపై చెన్నారెడ్డిగారికి పితూరీలు చెప్పారు. అసమ్మదీయులు ప్రతిపక్ష పార్టీల వారు ఈ ఉత్సవాలపై దుమారం లేపి రచ్చ చేసి పార్లమెంటు ఉభయ సభలలోను శాసన సభలోను దుమారం రేపారు. వ్యతిరేకత ఎంత ఎక్కువైతే చెన్నారెడ్డి తమకు అంత లొంగి ఉంటాడని భావించిన శ్రీమతి గాంధి అసమ్మతివాదులను అదుపు చేయలేదు. కేంద్రంలో మొరార్జీ నాయకత్వంలో పరిపాలన చేస్తున్న కాంగ్రెసేతర ప్రభుత్వంలో చెన్నారెడ్డిగారి సత్సంబంధాలు కూడా శ్రీమతి గాంధీ హర్షించలేకపోయారు. శ్రీమతి గాంధీ ధోరణి గ్రహించిన చెన్నారెడ్డి శాసనసభలో ఒక సందర్భంలో మాట దొర్లి తనకు ఎవ్వరి దయా దాక్షిణ్యాలు అక్కర లేదని పార్టీ శాసనసభ్యుల మద్దతు ఉన్నంతకాలం అధికారంలో కొనసాగగలనని వ్యాఖ్యానించడంతో అది ఆయన తిరుగుబాటు హెచ్చరికకు సంకేతంగా శ్రీమతి గాంధీ భావించారు. అయితే కొందరు మిత్రుల సలహా మేరకు చెన్నారెడ్డి తన వ్యాఖ్యలు సవరించుకొనే విధంగా వేరొక సందర్భంలో శాసనసభలో మాట్లాడుతూ శ్రీమతి గాంధీయే తన నాయకురాలు అని ప్రకటించారు. వ్రతం చెడినా ఫలం దక్కలేదు అన్నట్లు కొంతకాలం

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

తర్వాత చెన్నారెడ్డిగారు శ్రీమతి గాంధీ, శ్రీ సంజయ్‌గాంధీలకు తృప్తికలిగేటట్టు సహాయం చేయజాలకపోవడంతో వారు అస్మదీయులకు తమ ఆశీర్వాదబలం అందచేయడం వలన చెన్నారెడ్డి ఇరకాట పరిస్థితికి గురైనారు. తనకు అయిష్టులు అయిన వారినెవరినీ ఆయన తన మంత్రి వర్గం నుండి తొలగించలేకపోయారు. అయినప్పటికీ ప్రతిపక్ష పార్టీలను అదుపులో ఉంచుకుని, కాంగ్రెస్ పార్టీ బలహీన పడకుండా చూడగలిగారు. చెన్నారెడ్డి 1980 ప్రారంభంలో జరిగిన మధ్యంతర ఎన్నికలలో మెదక్ నియోజకవర్గం నుండి పోటీ చేసేందుకు శ్రీమతి గాంధీని రెడ్డిగారు నచ్చచెప్పగలిగారు. ఎన్నికలలో ఆమెతోపాటు 40 మంది కాంగ్రెస్ అభ్యర్థులు విజయం సాధించారు. తిరిగి కేంద్రంలో అధికారం చేపట్టిన అనంతరం చెన్నారెడ్డి పట్ల శ్రీమతి గాంధీ వైఖరిలో కొంత మార్పు వచ్చింది. సంజయ్‌గాంధీ కూడా చెన్నారెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుండి తొలగించే పన్నాగ రచనకు పూనుకున్నారు. జూన్ మాసంలో విమాన ప్రమాదంలో సంజయగాంధీ మరణించిన అనంతరం అసమ్మదీయులకు శ్రీమతి గాంధీ ఆశీర్వచనం లభించింది. శ్రీమతి గాంధీ శ్రీ పి.వి.నరసింహారావుతో రహస్య మంతనాల అనంతరం జి.రాజారాం, పరకాల శేషావతారం నేతృత్వంలో కొందరు మంత్రులు ప్రభుత్వం నుండి వైదొలగిన అనంతరం కుట్రను గ్రహించి చెన్నారెడ్డి తమ పదవికి రాజీనామా చేశారు. చెన్నారెడ్డి వారసుడిగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పదవీబాధ్యతలు చేపట్టిన శ్రీ అంజయ్య తన పదవిలో స్థిరపడకమునుపే అసమ్మదీయులు ఢిల్లీకి పరుగులు తీయడంతో శ్రీ రెడ్డిని పదవినుండి తొలగించడంలో తాము తొందరపాటు నిర్ణయం గైకొన్నానని శ్రీమతి గాంధీ గ్రహించింది. తప్పుచేశానని భావించినప్పుడు దానిని సరిదిద్దుకోవడం ఆమెకు అలవాటు. తనవల్ల ఎవరికైనా అన్యాయం జరిగినట్టు గ్రహించితే వారికి న్యాయం చేయడం కూడా ఆమె లక్షణం.

అందువలన చెన్నారెడ్డికి, ఆయన సీనియారిటీ, దక్షతకు తగినపదవి దేనినైనా అప్పగించాలనే తలంపు శ్రీమతి గాంధీకి కలిగింది. తక్షణమే ఆమె తన ప్రభుత్వంలో ఆర్థిక మంత్రి ప్రణబ్‌ముఖర్జీ ద్వారా డా. చెన్నారెడ్డిని ఢిల్లీకి పిలిపించారు. శ్రీమతి గాంధీ శ్రీ ముఖర్జీ ప్రణాళికాసంఘాన్ని పునర్ వ్యవస్థీకరించవలసిన ఆవశ్యకత గురించీ, చెన్నారెడ్డి ఆ బాధ్యతను సాధ్యమైనంత త్వరలో స్వీకరించవలసిన అగత్యం గురించి చర్చించారు. రేపో, మాపో ఆ పదవిలో తన నియామకం జరుగగలదనే అభిప్రాయాన్ని ఆమె చెన్నారెడ్డికి కల్పించారు. హైదరాబాదులో తాను అంతకుముందుగా నిర్ణయించుకున్న కార్యక్రమాలు త్వరగా పూర్తి చేసుకొనవలసినదిగా కూడా ప్రధానమంత్రి డాక్టర్ రెడ్డికి చెప్పారు. రాష్ట్రానికి తిరిగి వచ్చిన చెన్నారెడ్డికి అయిదు వారాల వరకు శ్రీమతి గాంధీ నుండి ఏ కబురూ అందలేదు. డా. రెడ్డికూడా ఆమె పిలిచినప్పుడు ఆలోచించవచ్చుననే ధోరణి అవలంబించారు. " నా సంగతి ఏమి చేశారు?" అని చెన్నారెడ్డి అడగకపోవడం శ్రీమతి గాంధీకి ఆశ్చర్యం కలుగజేసింది.

# II. పంజాబ్ రాజరికం

ఈలోగా పంజాబ్‌లో రాజకీయ పరిస్థితి దిగజారడం మొదలయ్యింది. సీనియర్ కాంగ్రెస్ నాయకుడెవరినైనా ఆ రాష్ట్ర గవర్నర్‌గా నియామకం చేస్తే తప్ప స్థానిక కాంగ్రెస్ నాయకుల మధ్య విభేదాలు, ఢిల్లీలో ఉన్న సిక్కు నాయకులు పంజాబ్ ప్రభుత్వంలో సిక్కు నాయకుల వైషమ్యాలు, సిక్కు తీవ్రవాదుల ప్రాబల్యం గురించి తనకు లోతైన అవగాహన ఏర్పడగలదని భావించి శ్రీమతి గాంధీ చెన్నారెడ్డిని పంజాబ్ గవర్నర్‌గా పంపాలనే నిర్ణయానికి వచ్చారు. శ్రీమతి గాంధీ అభిమతాన్ని డా. రెడ్డి ఆమోదించి, పంజాబ్ గవర్నర్‌గా పదవీబాధ్యతలు స్వీకరించారు. ఈ పదవీబాధ్యతలు అంగీకరించడానికి ముందుగానే శ్రీ చెన్నారెడ్డి తాను రాజకీయ పునరావాసం కొరకు ఏదో ఒక పదవి ఆమోదించాలనే ఆతృతలో లేనని శ్రీమతి గాంధీకి స్పష్టంచేశారు. అయితే, తను అనుభవం గల సీనియర్ నాయకుడు అవ్వడం వలన, దేశ సరిహద్దులపై ఉన్న పంజాబ్ లాంటి సున్నిత రాష్ట్రంలో తన సేవలను వినియోగించు కొనదలచుకున్నట్లు శ్రీమతి ఇందిరాగాంధీ చెన్నారెడ్డిని ఒప్పించగలిగారు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

చండీఘడ్ రాజ్‌భవన్‌లో అడుగుపెట్టిన తర్వాత పంజాబ్ పరిస్థితి అర్థం చేసుకొనేందుకు చెన్నారెడ్డికి ఎంతో సమయం పట్టలేదు. పంజాబ్ రాష్ట్రంలో అడుగుపెట్టిన మరుక్షణమే అక్కడిపరిస్థితి ఎవరినీ లెక్కచేసేట్టు లేదనీ, హోదాలకు, అధికారాలకు విలువలేని విధంగా పరిస్థితి క్షీణించిందని చెన్నారెడ్డి గ్రహించారు.

అకాలీల ఉద్యమానికి ప్రోదిచేసిన పూర్వరంగం గురించి ముఖ్యమైన అంశాలతో ఆ మర్నాడు తనకొక నివేదికను అందచేయవలసినదిగా ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ సి.ఎస్.పూరీకి గవర్నర్ మర్యాదపూర్వకంగా చెప్పారు. గవర్నర్ మాట కాదనలేకపోయిన ప్రధాన కార్యదర్శి ఆయన కోరిన అంశాల గురించి ఆషామాషీగా రెండు పేజీలు ఆయనకు సమర్పించారు. ఈ కాగితాలు అందుకొని తన విశ్వరూపం ప్రదర్శించిన చెన్నారెడ్డి "నేను పర్యాటకుడిగా చండీఘడ్ పట్టణానికి రాలేదు, రాష్ట్రాన్ని పరిపాలించేందుకు వచ్చాను, హోదాకు తగినట్టు ప్రవర్తించకపోతే నీ అంతు తేలుస్తానని" హెచ్చరించడంతో తెల్లవారకుండా 48 పేజీల సవివర పత్రంతో ప్రధాన కార్యదర్శి రాజ్‌భవన్ దగ్గర ప్రత్యక్షమయ్యారు. సమస్య పరిష్కారానికి చొరవ తీసుకొనేముందు ప్రధానమంత్రి ఆదేశాల కొరకు ఆయన ఎదురుచూచి ఆ విషయం ఆమెకు తెలియజేశారు.

హింసావాదాన్ని విడనాడవలసిందిగా తీవ్రవాదులకు అనేకవర్గాలు విజ్ఞప్తిచేసేట్టు ఉపాయమేదైనా చూడవలసిందిగా శ్రీమతి గాంధీ చెన్నారెడ్డిని కోరారు. గవర్నర్ ఆమెకు ప్రత్యామ్నాయ ప్రతిపాదన చేశారు. మంత్రాలకు చింతకాయలు రాలవు, అలాగే గవర్నర్ ఏదో ఉపాయం చేస్తే అకాలీవర్గాలు ప్రభుత్వం ఆశించినట్టు తీవ్రవాదులకు విజ్ఞాపనలు చేయరు, వారితో అలా చేయించినా తీవ్రవాదులు ప్రతిస్పందించే అవకాశాలు చాలా తక్కువ అనేది

చెన్నారెడ్డి అభిప్రాయసారాంశం. ప్రధానమంత్రి అనుమతించినట్లయితే గవర్నర్‌గా తామే అకాలీవర్గాలన్నింటికీ బహిరంగ విజ్ఞప్తిచేసి వారందరినీ చర్చల్లో తలమునకలు చేయగలననీ, చర్చల అనంతరం అకాలీవర్గాలు ప్రభుత్వ ప్రతినిధులు సంయుక్తప్రకటన ద్వారా, ప్రభుత్వం వారి కోరికలు కొన్నింటిని మన్నించినట్లు, అకాలీవర్గాలు ప్రభుత్వంనుండి కొన్ని రాయితీలు రాబట్టినట్టు అభిప్రాయం కలిగేట్టు ప్రకటన సారాంశం ఉండాలనీ, ఈ రాయితీలు ప్రజల్లో, తీవ్రవాదుల్లో చర్చానీయాంశం అయేట్టు చేయడంవల్ల అకాలీవర్గాలకు పరపతి ఉండగలదనీ చెన్నారెడ్డి వివరించారు. గవర్నర్ సూచనతో ఏకీభవించిన ప్రధానమంత్రి ఆయన చేయదలచుకున్న ప్రకటన ప్రతిని కూడా ఆమోదించారు. తాము చొరవ చూపిన అనంతరం తనను చులకన చేసే ఏ పనీ ప్రధానమంత్రి చేయకూడదనీ, ఉద్యమాల నిర్వహణ వాటి నాయకత్వ లక్షణాల గురించి తనకు అవగాహన ఉన్నదనే విషయం ప్రధానమంత్రి విస్మరించరాదని గవర్నర్ ఆమెకు సుస్పష్టంగా చెప్పారు. తాను గవర్నర్ అభిప్రాయాలను తు.చ తప్పకుండా పాటించగలనని ప్రధానమంత్రి సుస్పష్టమైన హామీ ఇచ్చిన తక్షణమే గవర్నర్ పంజాబ్ క్లిష్ట సమస్య పరిష్కారానికి చొరవ చూపారు.

అనేకానేక సిక్కువర్గాలు, ముఠాలు, ఉపముఠాల నాయకులతోను, తాము నాయకులమని భావిస్తున్న ముఖ్య వ్యక్తులతోను సంబంధాలు ఏర్పరచుకున్న గవర్నర్ చర్చలు ఆయన నిర్థేశించుకున్న మార్గంలో పురోగమించసాగాయి. ఈ దశలో గవర్నర్‌ను ఆశీర్వదించి ప్రోత్సహించే బదులు శ్రీమతి గాంధీ, కారణాలు ఏమైతేనేం పక్కదారిపట్టారు. రహస్యంగా ఆమె తన రాయబారులను పంజాబ్‌కు పంపించి సిక్కువర్గాల నాయకులు తీవ్రవాదులతో మంతనాలు మొదలుపెట్టటమే కాక, పార్లమెంటుసభ్యుడు ఒకరిద్వారా గుప్తంగా బింద్రన్‌వాలాతో సరాసరి సంబంధం ఏర్పరచుకున్నారు.

ఈ పార్లమెంటు సభ్యుడు శ్రీమతి గాంధీకి అత్యంత సన్నిహితుడని ˉ గడించిన వ్యక్తి. అందువలన అతను ఎప్పుడు పంజాబ్ దర్శించి, ముఖ్యమంత్రి ప్రభృతులు ఆయనను సకల లాంఛనాలతో సన్మానించడమేకా, ఆయన మాట్లాడిన ప్రతి మాట, ప్రధాని నోటినుండి ఊడిపడుతున్నట్లు భావించేవారు. ఈ పార్లమెంటుసభ్యుడినే కాక మాజీ విదేశాంగ మంత్రి శ్రీ స్వరణ్‌సింగ్‌ను కూడా ఉపయోగించుకునే ప్రయత్నం చేశారు శ్రీమతి గాంధీ. ఒక పర్యాయం శ్రీమతి గాంధీ అనధికార ప్రతినిధిగా పంజాబ్ వెళ్ళి అయిదు రోజులు అక్కడ మకాం వేసి అనేకమందితో చర్చలు జరిపిన స్వరణ్‌సింగ్ తన రాక ఆంతర్యం గురించి పరోక్షంగా మాటవరసకైనా గవర్నర్‌తో చెప్పలేదు. ఈ విషయాలన్నీ గ్రహించిన గవర్నర్ అరమరికలు, జంకూ గొంకూ లేకుండా ప్రధానమంత్రికి నిరసనను తెలియజేసి తాను చొరవచూపడం మానుకున్నారు. తన ప్రకటన ముసాయిదాకు ప్రధానమంత్రి ఆమోదం లభించిన అనంతరం ఈ గ్రంథ రచయిత సహా కొందరు స్నేహితులతో డా.చెన్నారెడ్డి మాట్లాడుతూ పంజాబ్ జటిలసమస్యకు పది, పదిహేను రోజుల్లో తాము ఒక పరిష్కారం సాధించనున్నట్టు చెప్పారు.

ఆశించినట్లే, వివిధ వర్గాలతో ఆయన జరుపుతున్న చర్చలుకూడా దిన దిన పురోభివృద్ధి చెందడంతో తనను కాదని ఆయనేదో ఘనకీర్తి సంపాదించ గలరవి ప్రధానమంత్రి భావించారు. అందువలన ఆమె గవర్నర్‌కు తెలియకుండా సమాంతర చర్చలు రహస్యంగా కొనసాగించారు. గవర్నర్‌కు ఆగ్రహం కలిగిన సంగతి గ్రహించిన ప్రధానమంత్రి తాను సిమ్లా సందర్శిస్తున్న సందర్భంలో అక్కడి రాజ్‌భవన్‌లో కలుసుకొనవలసిందిగా పంజాబ్ గవర్నర్‌ను పిలిపించు కున్నారు. విమానాశ్రయంలో మర్యాదపూర్వకంగా తనను కలుసుకొనేందుకు వచ్చిన గవర్నర్‌ను ప్రధానమంత్రి దూరంగా ఒక మూలకు తీసుకునివెళ్ళి

చాలాసేపు ఆయనతో సంభాషించారు. దూరంనుండి ఈ సుదీర్ఘ రహస్యచర్చలు గమనించిన పత్రికావిలేఖరులు పంజాబ్ సమస్యకు ఏదో పరిష్కారం వచ్చేస్తున్నదని భావించారు. కొంతకాలంగా గవర్నర్ వివిధవర్గాలతో జరుపుతున్న రహస్య మంతనాల దరిమిలా ప్రధానితో భేటీ అయ్యారంటూ పత్రికలవారంతా తమకు తోచినట్టు పుంఖానుపుంఖంగా పతాకశీర్షిక కింద ఊహాగానాలు వ్రాయడం జరిగింది. శ్రీమతి ఇందిరాగాంధీ చెన్నారెడ్డి ఒకరితో ఒకరు మాట్లాడుతున్న ఫోటోలుకూడా వివిధ కోణాలనుండి తీసి ప్రచురించారు. వారు పంజాబ్ గురించి చర్చించిన అంశాల గురించి ఉభయులూ ఒక అవగాహనకు వచ్చి చిరునవ్వులు నవ్వారని పత్రికాప్రతినిధులు భావించి తమ భావనను అసంఖ్యాక పాఠకులకు శరవేగంతో చేరవేశారు. ఈ విషయంలో ప్రభుత్వ ప్రచార సాధనాలు కూడా వెనుకపడలేదు. పంజాబ్ సమస్యపై ప్రధాని-గవర్నర్ రహస్య చర్చల వివరాలపై " విశ్వసనీయవర్గాల కథనం ప్రకారం" ప్రభుత్వ ప్రచార సాధనాలుకూడా తమ శ్రోతలకు "వివరాలు" తెలియజేశాయి.

ఈ అవాస్తవిక వార్తలను నాటినుండి నేటివరకూ ఎవరూ ఖండించలేదు. హిమాచల్‌ప్రదేశ్ శాసనసభకు అప్పుడు జరుగుతున్న ఎన్నికల గురించి ప్రచార సందర్భంలో తమ అనుభవాల గురించి ఫలితాలపై తన అంచనా· గురించి ప్రధానమంత్రి గవర్నర్‌కు సవివరంగా రహస్య వివరణ ఇచ్చింది. కొందరు కాంగ్రెస్ అభ్యర్థులకు ఆర్థిక వనరులు సమకూర్చవలసిందిగా శ్రీమతి గాంధీ గవర్నర్‌ను కోరారు. పొరుగు రాష్ట్రంలో ఎన్నికల ప్రచార సరళి గురించి తన అవగాహనను, వివిధ పార్టీల జయాపజయాల గురించి తనకు తోచిన అంచనాలను వివరంగా ప్రధానికి తెలియజేసిన గవర్నర్ కాంగ్రెస్ అభ్యర్థులకు ఆర్థిక వనరులు సమకూర్చే విషయంలో మాత్రం తమ నిస్సహాయతను వ్యక్తంచేశారు. సరే మంచిదిలేండి అంటూ ఆమె ఒక చిరునవ్వు నవ్వగా,

థ్యాంక్యూ మేడమ్ అంటూ ఆయన ఒక చిరునవ్వు విసిరారు. గవర్నర్‌గా డా. చెన్నారెడ్డి " అక్షింతలు" వేయకుండా ముఖ్యమంత్రి దర్బారాసింగ్‌ను కూడా వదలలేదు. ఒకరోజు దర్బారాసింగ్‌ను రాజ్‌భవన్‌కు ఆహ్వానించిన గవర్నర్ మాటల సందర్భంలో రాజ్యాంగప్రతిని, జాతీయపతాకాన్ని సిక్కు తీవ్రవాదులు తగులపెట్టిన సంగతి ప్రస్తావించారు. "అవును, నేను పదవీబాధ్యతలు స్వీకరించకమునుపు అలాంటి సందర్భాలు జరిగి ఉండవచ్చునని" ముఖ్యమంత్రి విషయాన్ని దాటవేసే ప్రయత్నం చేయగా, ముఖ్యమంత్రిగా ఆయన పదవీబాధ్యతలు స్వీకరించిన తేదీ, జాతీయపతాకం, రాజ్యాంగ ప్రతిని దహనంచేసిన తేదీని వివరించిన గవర్నర్, పోలీస్‌నివేదికలు, వార్తాపత్రికలు చదివే అలవాటు లేదా అని నవ్వుతూ ముఖ్యమంత్రిని ప్రశ్నించారు. " అబద్ధం ఆడితే ఈయనతో చాలా ప్రమాదంలా ఉందే" అనే అభిప్రాయం దర్బారాసింగ్‌కు కలుగజేశారు.

అంతటితో ఆగక లండన్ నగరంలో భారత జాతీయ పతాకాన్ని రాజ్యాంగ ప్రతిని దహనం చేసిన సిక్కు తీవ్రవాదులపై బ్రిటీష్ ప్రభుత్వం చర్యలు చేపట్టినట్టు పత్రికల్లో ప్రకటితమైన వార్తలను పంజాబ్ ముఖ్యమంత్రికి చూపించటం ద్వారా ఆయన ఇంకా కుంచించుకుపోయేట్టు చేశారు గవర్నర్.

ప్రధానమంత్రి పంజాబ్ విషయంలో ఏ ధోరణి ఎందుకు అవలంబి స్తున్నారో గవర్నర్‌కే అర్థంకాని పరిస్థితి ఒకవైపు కొనసాగగా మరొకవైపు తీవ్రవాదుల ఆగడాలు నానాటికీ మితిమీరిపోసాగాయి. బాధ్యతగల జాతీయ నాయకుడిగా, పరిస్థితులను అభినందించలేకపోయిన గవర్నర్ చెప్పులు శాలువాలో పెట్టి మెడలో వేసినట్టు రాష్ట్ర గవర్నర్ తనను తీవ్రంగా పరోక్షమందలింపుకు గురిచేస్తున్నారని గ్రహించి ఆవేదన చెందిన ముఖ్యమంత్రి స్వగతంలా తన పరిధులు, ఇబ్బందులు చెన్నారెడ్డికి వెల్లడించారు. బింద్రన్‌వాలాకు రహస్యంగా

అండదండలు కల్పించి అతడిని భూతంలా చూపి వివిధవర్గాల అకాలీలు తన దారికి వచ్చేట్టు చేసుకోవడం శ్రీమతి గాంధీ అభిమతమనేది తన నమ్మకం, విశ్వాసమనీ కనుక తీవ్రవాదుల అదుపు విషయంలో తాను నిర్ణయించుకున్న హద్దుదాటి వ్యవహరించలేనని దర్బారాసింగ్ అమాయకంగా చెన్నారెడ్డికి వెల్లడిచేశారు.

గవర్నర్-ముఖ్యమంత్రి సమావేశం గురించి తెలుసుకున్న ప్రధానమంత్రి, బలహీనుడైన దర్బారాసింగ్‌ను పదవినుండి వైదొలగించి అతని స్థానంలో ఒక శిక్కు మాజీ గవర్నర్‌ను పంజాబ్ ముఖ్యమంత్రిగా నియమించడం వలన ప్రయోజనం ఉండగలదని రెడ్డిగారికి సూచన చేశారు. ఆమె సూచనతో అంగీకరిస్తూనే, ఉపముఖ్యమంత్రిగా ఒక హిందువునుకూడా నియమించడం వలన ఆమె ప్రతిపాదన సత్ఫలితాలు సాధించగలదని అన్నారు చెన్నారెడ్డి. "మంచిదే అలాంటి నాయకుడు ఉండాలి కదా" అంటూ శ్రీమతి గాంధీ మాట దాటవేసే ప్రయత్నం చేయగా, సిక్కులందరికీ ఆమోదయోగ్యుడైన ఒక హిందూ మతస్థుడైన సీనియర్ నాయకుని పేరు డా. చెన్నారెడ్డి తడుముకోకుండా సూచించారు. ఈ ప్రతిపాదనకు ప్రధానమంత్రి నుండి తక్షణం ఏ ప్రతిస్పందనా వెలువడలేదు. అయితే ఆ తర్వాత ఆమె ముఖ్యమంత్రి మార్పు గురించి ప్రస్తావించలేదు. కొన్ని వారాల అనంతరం ప్రధానమంత్రి పంజాబ్ గవర్నర్‌ను ఢిల్లీకి పిలిపించి ఆ రాష్ట్రంలో సంక్లిష్ట పరిస్థితికి పరిష్కారం కనుగొనడానికి సూచనలు చేయవలసిందిగా కోరారు. అంతవరకు ఏమీ జరుగనట్టు ఆమె తన సలహా కోరటం పట్ల ఆశ్చర్యచకితుడైన చెన్నారెడ్డి " బేగానేకీ షాదీమే అబ్దుల్లా దివానా" అనే సామెత తమకు తెలిసే ఉంటుంది, నేను అబ్దుల్లా పాత్ర వహించ దలచుకోలేదు అని ఒక చిరునవ్వుతో చెప్పారు. అంటే ఊళ్ళో పెళ్ళికి కుక్కల హడావిడి అనే సామెత వంటిది. మీరు ఏదో పరిష్కారం సాధించాలనుకుంటే మీకు నా సలహాలు కావాలా? అని చెన్నారెడ్డి ఆమెకు చురకంటించారు.

ఆ తర్వాత డా. రెడ్డి శెలవుపై హైదరాబాద్‌కు వచ్చారు. ఆయన ఆంధ్ర ప్రదేశ్‌లో ఉండగానే హిందూ దినపత్రిక డా. చెన్నారెడ్డి గవర్నర్ పదవికి రాజీనామా చేసే అవకాశం ఉన్నట్టు ఒక వార్త ప్రచురించింది. ఈ వార్తలో సత్యాసత్యాలను గురించి ప్రధానమంత్రి కార్యాలయ అధికారి ఒకరు తెలుసుకొనకోరగా అలా అని నేనెవరితోనూ చెప్పలేదు, ఒకవేళ గవర్నర్ పదవి వదలుకోవడం గురించి నేను ఎలా భావించగలనని ప్రధానమంత్రి తెలుసుకొన కోరినట్లయితే, నాకు ఉ పదవిపై మోజులేదనే సంగతి ఆమెకు చెప్పండి" అని డా. రెడ్డి సమాధానం ఇచ్చారు. ఈ దశలోకూడా ఆమె గవర్నర్ ఆవేదనను అభినందించలేదు. తరువాత కొద్దిరోజులకే అటు అకాలీవర్గాలను, ఇటు గవర్నర్‌ను సంప్రదించకుండా సిక్కువర్గాల కోరికలలో కొన్నింటిని కేంద్ర ప్రభుత్వం ఆమోదించినట్టు శ్రీమతి గాంధీ ప్రకటించారు. ఆమె ఔదార్యాన్ని ఎవరూ అభినందించలేదు. పైగా, చెన్నారెడ్డి సహాయంతో పంజాబ్ సమస్యకు పరిష్కారం కనుక్కోవాలని నాటి దేశీయాంగ శాఖ మంత్రి జ్ఞానీసింగ్ ప్రయత్నం చేస్తున్నారనే అపోహతో, ఆయనకు ఆ ప్రతిష్ఠ దక్కకుండా చూచేందుకే ఎవరికీ చెప్పకుండా ఏకపక్షంగా శ్రీమతి గాంధీ తన ప్రకటనను విడుదలచేశారని పలువురు వ్యాఖ్యానించారు.

ఏమైతేనేమి శ్రీమతి గాంధీ చూపిన ఔదార్యం పంజాబ్ పరిస్థితిలో ఏ మార్పుకూ దోహదం చేయలేదు. కానీ గవర్నర్ చెన్నారెడ్డి తన పదవికి (1982) రాజీనామా చేశారు. ఆ తర్వాతిరోజుల్లో పంజాబ్‌లో పరిస్థితి తీవ్రస్థాయికి వెళ్ళి స్వర్ణదేవాలయంపై సైనిక దాడికి అందుకు ప్రతిగా శ్రీమతి గాంధీ ఘోరహత్యకు దారితీసింది. "గవర్నర్‌గా మీరు కొనసాగి మీ పని మీరు చేసుకునే స్వేచ్ఛ మీకు దొరికినట్లయితే పంజాబ్ పరిస్థితి వేరుగా ఉండెడిది" అని రాష్ట్రపతి పదవి చేపట్టిన అనంతరం జ్ఞానీ జైల్‌సింగ్ డా. చెన్నారెడ్డికి రాసిన లేఖలో పేర్కొనడం గమనార్హం.

## 12. కాంగ్రెస్ పార్టీకి 'తిలోదకాలు'

సుదీర్ఘ పరిచయాలు వ్యక్తులు పరస్పరం పూర్తిగా అవగాహన చేసుకునేందుకు తోడ్పడవు. ఏదైన ఒక సమయం, సందర్భం వచ్చినప్పుడే ఎవరేమిటో ఎవరి సత్తా ఎంతో, ఎవరి మనస్థత్వం ఎలాంటిదో ఎదుటి వారికి తెలిసివస్తుంది.

1950 లో తాము తాత్కాలిక పార్లమెంటు సభ్యుడుగా ఉన్న నాటినుండి శ్రీమతి గాంధీతో డాక్టర్ గారికి పరిచయం ఉన్నది. అయితే, 1969-72 మధ్యకాలంలో తెలంగాణ ఉద్యమ నాయకుడిగా ఉన్న కాలంలో ఆమె గురించి అంతకు ముందు కంటే ఎక్కువగా తెలుసుకొనగలిగారు. డాక్టర్ గారి సత్తా ఆమెకు తెలిసింది.

తరువాతి కాలంలో శ్రీమతి గాంధితో ఆయన అనుభవం వేరు. 1981 లో హుటాహుటిన హైదరాబాదు నుండి తనను డిల్లీ పిలిపించి ప్రణాళికా సంఘం అధ్యక్ష పదవి ఇవ్వ జూపిన శ్రీమతి గాంధీ తర్వాత అనేక మాసాలు నిమ్మకు నీరెత్తినట్లు కిమ్మన లేదు. 1982 లో మళ్లా అకస్మాత్తుగా కబురు పంపించి, పంజాబ్ రాష్ట్ర, గవర్నర్ బాధ్యతలు నిర్వహించడానికి 'మీ కంటే

సీనియర్ నాయకుడు సమర్థుడు నాకెవరూ కనుపించడంలేదు' అన్నారు. ఆమె పొగడ్తలను నిజమని నమ్మి పంజాబ్ వెళ్ళిన డా॥ చెన్నారెడ్డి గారికి చేదు అనుభవాలు ఎదురైనాయి. ఇచ్చకాల మాటలు చెప్పి నమ్మిన వారిని పెడదోవ పట్టించగల సమర్థత శ్రీమతి గాంధికి ఉన్నంత మరే రాజకీయ నాయకులకు లేదని ఆయన గ్రహించారు.

తన తెలివితేటలు, సమర్థతో ఎవరైనా పలుకుబడి సంపాదించుకొనే సూచనలు కనుపించనప్పుడు సహచరులు తమకంటే ఎక్కువ ఎదిగి పోతారేమోననే భయం ఆమెను ఆవహించుకుంటుంది అని చెన్నారెడ్డి అర్థంచేసుకున్నారు. ఆమెతో అమ్మగారో, తల్లిగారో అనికాక 'ఇందిరాజీ' అని సంభోదించి ఆమెకళ్ల లోకి చూస్తూ ధైర్యంగా సమస్థాయిలో మాట్లాడగల ధైర్యాన్ని డాక్టర్‌గారు తప్ప మరే సమకాలీన నాయకుడు ప్రదర్శించలేదంటే అతిశయోక్తి కాజాలదు. సెలవుపై హైదరాబాద్ వచ్చినప్పుడు చెన్నారెడ్డిగారు తన పదవికి రాజీనామా చేసే అవకాశముందని ఒక ఆంగ్ల దినపత్రిక ఢిల్లీ ప్రచురించిన వార్త ఆయనకు ఆశ్చర్యాన్ని కలుగజేసింది. సెలవు తరువాత ఢిల్లీ వెళ్లినప్పుడు పంజాబ్ విషయంలో ఆమె అనుసరిస్తున్న పద్ధతి తనకు నచ్చలేదని డాక్టర్‌గారు ప్రధానికి అర్థమయ్యే భాషలో పరోక్షంగా చెప్పారు. ఏమైనప్పటికీ ఇందిరాగాంధీపై ద్వేషం, కోపం లేకున్నా దేశ సమస్యల పరిష్కారానికి ఆమె అవలంభించే పద్ధతులు నచ్చక డాక్టర్ గారు 1983 ఫిబ్రవరి 6వతేదీన పంజాబ్ గవర్నర్‌గా తన పదవికి రాజీనామా చేసి హైదరాబాద్ తిరిగివచ్చారు.

కొద్ది రోజుల పూర్వమే (జనవరి 9న) తెలుగుదేశం ప్రభుత్వ ముఖ్యమంత్రిగా ఎన్టీఆర్‌గారు అధికారం స్వీకరించారు. తనకు ఉన్నపాత పరిచయాలు పురస్కరించుకొని మర్యాద పూర్వకంగా ముఖ్యమంత్రి చెన్నారెడ్డి దంపతులను విందుకు ఆహ్వానించి నూతన వస్త్రాలతో సత్కరించారు. ప్రజా

సమస్యలపై డాక్టర్‌గారి సలహాలు కూడా ఎన్టీఆర్ కోరడం జరిగింది. వింధు రాజకీయమైనదని కొన్ని పత్రికలు వ్రాశాయి. నాటి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు డా॥ వై.యస్. రాజశేఖర్ రెడ్డి, ఒక సీనియర్ పార్టీనేతగా డాక్టర్‌గారికి హక్కుగా లభించవలసిన గౌరవాన్ని ఇవ్వలేదు. చెన్నారెడ్డి అనుయాయులు అని చెప్పబడే వారే కాక, పార్టీనాయకులలో అనేక మంది అసంతృప్తితో ఉన్నారు.

పరిస్థితి అవగాహన చేసుకున్న చెన్నారెడ్డి నాలుగైదు మాసాలపాటు స్వంతపనులు చూచుకుంటూ, దేశ రాజకీయాలను అధ్యయనం చేస్తూ ఉరుకున్నారు. ఆరోజులలో శ్రీమతి గాంధీకి అత్యంఓ సన్నిహితంగా ఉన్న సీనియర్ కాంగ్రెస్ నాయకుడు కమలాపతి త్రిపాఠి గారు ఒక ఉదయం టెలిఫోన్ చేసి "ప్రధానమంత్రి మిమ్మల్ని కేంద్రమంత్రివర్గంలోకి ఆహ్వానించాలను కుంటున్నారు. రక్షణశాఖ ఇవ్వాలనుకుంటున్నారు. మీ అభిప్రాయం ఏమిటి' ' అని ప్రశ్నించగా ప్రస్తుతానికి నేను పదవుల అన్వేషణలో లేనని ఆమెకు చెప్పండి అని డాక్టర్ గారు చిరునవ్వుతో సమధానం చెప్పారు. ఆనాటి వాతావరణంలో కొత్తరాజకీయ పార్టీ స్థాపించడం మినహా తమకు వేరే గత్యంతరం లేదని పలువురు సహచరులు సూచించగా సుమారు మూడు నెలల పాటు డాక్టర్‌గారు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలు పర్యటించి అనేకులతో చర్చించారు.

1983 సంవత్సరాంతంలో 1984 జనవరి మాసంలోను హైదరాబాదు, విజయవాడ ప్రాంతాలలో కొందరు కార్యకర్తలు రాజకీయ సదస్సులు జరిపి నూతన పార్టీ ఏర్పాటుకు అనుకూలంగా తీర్మానించారు. కాంగ్రెస్ పార్టీలో ఇందిరాగాంధీ పట్ల వ్యతిరేకత నానాటికి పెరుగుతున్నందున ఈ అసమ్మతి వాదులందరికీ జాతీయస్థాయిలో ఒక వేదికను సమకూర్చాలని చెన్నారెడ్డి భావించారు. ఈ ఆలోచన పరిణామమే 1984 ఫిబ్రవరి 26వతేదీన విజయవాడలో నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంట్ అవిర్భావానికి ప్రేరణ కలుగజేసింది.

సతీమణి సావిత్రి, ప్రొఫెసర్ జి.వి. సుధాకరరావు, శ్రీమతి ఉమావెంకటరాం మరికొందరు అనుయాయులతో హైదరాబాద్‌నుండి ఆ ఉదయం విజయవాడ చేరిన చెన్నారెడ్డి గారికి కృష్ణానది వంతెన వద్ద అఖండస్వాగతం లభించింది. రెండువందలకు మించిన పూలహారాలు ఆయనకు అభిమానులు సమర్పించారు. చెన్నారెడ్డి, యల్.లక్ష్మణ్‌దాసు, సిహెచ్‌యస్‌ఆర్‌విపి మూర్తిరాజు, రాయవరం మునసబుగారు మరికొందరు కాంగ్రెస్ నాయకులు అసంతృప్తితో ఉన్నారనే సంగతి తెలుసుకున్న శ్రీమతి గాంధి జనవరినెలలోనే వారితోను కె.యల్. యన్ ప్రసాద్‌వంటి వారితోను సంప్రదింపులు జరపాలని భావించారు.

అయితే కొందరు నాయకులు ఆమె ఆలోచనలను పడనీయక, జలగం వెంగళరావు లాంటి వారిని తిరిగి కాంగ్రెస్‌లో చేర్చుకోవడం ద్వారా పార్టీ పలుకుబడి పెంచుకోవాలని సూచించడం జరిగింది. అందువలన శ్రీమతి గాంధీ సన్నిహితులలో ఒకరైన యు.పి. నాయుకురాలు రాజేంద్రకుమారి బాజ్‌పాయ్ హైదరాబాద్ వచ్చి 1984 ఫిబ్రవరి 25వ తేదీన వెంగళరావుతో మంతనాలు జరిపారు. నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంట్ ఆవిర్భవించిన పది పదిహేనురోజులకు వెంగళరావు భేషరుతుగా తన అనుయాయులతో కాంగ్రెస్‌లో చేరారు. అయితే 1985లో జరుగవలసిన లోక్‌సభ ఎన్నికలలో ఖమ్మం స్థానాన్ని కేటాయించటమే కాక, ఆతరువాత ఏదో ఒక పదవిని కూడా ప్రధాని ఆయనకు కట్టపెట్టగలరని శ్రీమతి బాజ్‌పాయ్ వెంగళరావుకు హామీ ఇచ్చారు. నేషనల్ డెమోక్రటిక్ పార్టీ బాలారిష్టాల నుండి బయటపడకపూర్వమే, శ్రీమతి గాంధీ హత్యకు గురికావడం, రాజీవ్ గాంధీ ఆమె వారసుడిగా ప్రభుత్వ, పార్టీ అధిపత్యాన్ని స్వీకరించడం మధ్యంతర ఎన్నికలు జరపాలని నిర్ణయించడం జరిగింది. వెంగళరావుకు ఖమ్మం స్థానం లభించింది.

1984 డిసెంబర్ ఎన్నికలలో డాక్టర్‌గారు కరీంనగర్‌నుండి లోక్‌సభకు పోటీ చేయగా యన్టీఆర్ తన పార్టీ అభ్యర్థిని పోటీగానిలుపలేదు. అందువలన

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

తెలుగుదేశం మిగతా కాంగ్రెసేతర పక్షాలకు చెందిన వెలమ నాయకులందరూ, తమ కులానికి చెందిన సీనియర్ కాంగ్రెస్ నాయకులు చొక్కారావుగారి కొమ్ముకాచి ఆయనను గెలిపించారు. అప్పటికే రాష్ట్ర ప్రజానీకం స్థూలంగా మూడు వర్గాలు - తెలుగుదేశం, కాంగ్రెస్, కమ్యూనిస్ట్ పార్టీలు-గా విడిపోయింది. మిగతా పార్టీలకు నామమాత్రంగానేనైనా చెక్కుచెదరని అనుయాయవర్గం మిగిలిపోయింది. ఈ పరిస్థితులలో తన నాయకత్వంలో ఉన్న నేషనల్ డెమోక్రటిక్ పార్టీని నిర్మించేందుకు డాక్టర్‌గారు గట్టి ప్రయత్నమే చేయలేదు పైగా కొందరు అనుయాయులు అభిమానులు అనుకున్నవారే ఆయనకు వెన్నుపోటు పొడిచారు. కాలం దొర్లిపోయింది.

# 13. మాతృసంస్థలో పునఃప్రవేశం

1986 ప్రాంతంలో రాజీవ్ గాంధీ పలుకుబడి క్షీణించడం మొదలవగానే, అంతకు ముందు తన తల్లిపై అయిష్టతతో పార్టీని వదలివెళ్లిన సీనియర్ కాంగ్రెస్ నాయకులను తిరిగి ఎలాగైనా పార్టీలోకి రప్పించాలనే ఆలోచన రాజీవ్‌గాంధీకి ఆయన సలహాదారులకు కలిగింది. ఈ ఆలోచన పర్యవసానంగానే శరద్‌పవార్, డాక్టర్ చెన్నారెడ్డి వంటి అగ్రశేణి నాయకులు తిరిగి కాంగ్రెస్‌లో (1968) చేరడం జరిగింది. డాక్టర్ గారిని రాజీవ్‌గాంధీ ఎంతో గౌరవంగా ఆదరంగా చూచేవారు. ఆయన సమర్థత నాయకత్వ లక్షణాలపై రాజీవ్‌కు అచంచలవిశ్వాసం ఉండేది. ఈ లోగా 1983-88 మధ్య కాలంలో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులుగా నలుగురిని మార్చవలసి వచ్చింది. ఎవరిని కూడ వారి ప్రత్యర్థులు ప్రశాంతంగా పనిచేయనీయలేదు. అధిక సంఖ్యాకులను కలుపుకొని పనిచేసే సమర్థత పి.సి.సి నేత పదవిలో ఉన్నవారు చూపలేకపోయారు.

అక్టోబర్ 1988లో పి.సి.పి అధ్యక్షులుగా నియుక్తులైన యన్. జనార్దన్‌రెడ్డి

ఆరు నెలలు తిరగకమునుపే పార్టీలో అన్ని వర్గాలకు శత్రువైపోవడంతో ఆయన స్థానంలో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షునిగా చెన్నారెడ్డిని నియమించారు. రాజీవ్‌గాంధీ. అప్పుడపుడే లోక్‌సభ మధ్యంతర ఎన్నికలకు అన్ని పార్టీలు సంసిద్ధమవు తున్నాయి. లోక్‌సభతోపాటే శాసనసభకు కూడ ఎన్నికలు పూర్తి చేయించడం తన పార్టీకి ప్రయోజనకరం అనే ఆలోచన ముఖ్యమంత్రి రామారావుకు కలిగింది.

ముందు చూపుగల డాక్టర్‌గారు తను గాంధీభవన్‌లో అడుగుపెట్టిన మరుక్షణంనుండి పార్టీలో అన్ని వర్గాలలో వివిధ దశలలో పనిచేసే కార్యకర్తలతో విడివిడిగాను బృందాలగాను చర్చలు జరిపి, వారి విశ్వాసం పొంది పార్టీని క్రింది నుండి పైకి పునర్నిర్మాణం చేసే పనికి శ్రీకారం చుట్టారు. కార్యకర్తలను కార్యరంగంలోకి పురమాయించే కార్యక్రమాలు రూపొందించి వారికి అప్పగించారు. పునాదులు పదిలంచేసుకున్న తెలుగుదేశం ప్రభుత్వాన్ని పైదొలగించాలంటే ప్రతికార్యకర్త నిర్విరామంగా చిత్తశుద్ధితో పనిచేయాలని ఆయన ఉద్బోధించారు. మామూలు పరిస్థితిలో ప్రత్యర్థి రాజకీయ పార్టీలనాయకులు మధ్య ఉండే విభేదాలకంటే తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు రామారావు కాంగ్రెస్‌నేత రాజవ్‌గాంధీల మధ్య నెలకొన్న వైరం అతితీవ్రమైనది.

కాంగ్రెస్ వ్యతిరేకులను ప్రత్యేకించి గాంధీ కుటుంబం పట్ల అయిష్టతకల వారందరిని కూడ గట్టుకొని కాంగ్రెస్ పార్టీని తుడిచివేయాలనేది, రాజీవ్‌గాంధికి ఏపదవిలేకుండా చేయాలనేది ఎన్టీఆర్ ఏకైకధ్యేయం. ఆరునూరైన సరే తెలుగుదేశం అధినేతను గద్దీకరిపించి అతనికి గుణపాఠం చెప్పకపోతే తమ మనుగడే కష్టమనేది రాజీవ్‌గాంధీ అభిప్రాయం. ఈ పూర్వరంగంలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ఆధిపత్యాన్ని స్వీకరించిన చెన్నారెడ్డి గారు రానున్న రాజకీయ యుద్ధానికి కార్యకర్తలను కార్యోన్ముఖులను చేసేందుకు ఎన్నో కార్యక్రమాలకు రూపకల్పన చేశారు. క్షీణిస్తున్న శాంతి భద్రతలు దిగజారిపోతున్న పాలనను నిరసిస్తూ పోలీస్‌స్టేషన్స్, ప్రభుత్వ కార్యలయాల ముందు ప్రదర్శనలకు పిలుపునివ్వగా

లక్షలాదిమంది కార్యకర్తలు ఈ కార్యక్రమాలలో పాల్గొన్నారు. తన నేతృత్వంలో సామూహిక నిరసన ప్రదర్శనలకు పిలుపునివ్వగా రాష్ట్ర వ్యాప్తంగా లక్షలాదిమంది అరెస్టయినారు. రెడ్డిగారు కూడ నగరంలో అరెస్టయిన వారికి స్వయంగా నాయకత్వం వహించారు.

తెలుగుదేశ ప్రభుత్వ దుష్పరిపాలనను నిరసిస్తూ దానిని అంతం చేయాలని రాష్ట్రపతిని కోరే విజ్ఞప్తి పత్రంపై కోటి మంది సంతకాలు చేయాలనే పిలుపు ఇచ్చి చెన్నారెడ్డి ఈ యజ్ఞంలో కాంగ్రెస్ వారినే కాక ప్రజలలో పెక్కుమందిని భాగస్వాములను చేయగలిగారు. అందువల్ల రాజీవ్‌గాంధీ తమ లక్ష్యసాధనకు తోడ్పడగల ధీశాలి కేవలం డాక్టర్ గారేనని గ్రహించి ఎన్నికల ముందు ఆయనకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు.

లోక్‌సభ ఎన్నికలకు పార్టీ రూపొందించిన మానిఫెస్టోకాక శాసనసభ ఎన్నికల కొరకు అదనంగా మరొక ప్రణాళికను రచించేందుకు పార్టీ అధ్యక్షుని అనుమతిపొందిన చెన్నారెడ్డిగారు వివిధ వర్గాల ప్రజలను, వివిధ వృత్తులలో ఉన్నవారిని ఆకట్టుకొనే విధంగా దానిని రూపొందించారు.

లోక్‌సభ ఎన్నికలలో రెండు మినహా మిగతా స్థానాలన్నింటినీ కాంగ్రెస్ కైవసం చేసుకొని లోక్‌సభలో తెలుగుదేశం పార్టీని జంట పక్షుల పార్టీచేసింది. శాసన సభ 294 స్థానాలలో అంతకుముందు 202 స్థానాలు గెలుచుకొని జబ్బలు చరిచిన తెలుగుదేశం పార్టీ 1989 ఎన్నికలలో కేవలం 62 స్థానాలను మాత్రమే గెలుచుకొనగలిగింది. సనత్‌నగర్ నుండి పోటీ చేసిన డాక్టర్‌గారు ఘన విజయం సాధించగా, రెండు నియోజకవర్గాలలో పోటీచేసి రామారావు, కల్వకుర్తి నియోజకవర్గంలో వోటమి చవిచూచి హిందూపురంలో మాత్రం నెగ్గ గలిగారు.1978లోవలనే 1989లో కూడ అతి స్వల్ప కాలం ప్రదేశ్ కాంగ్రెస్‌కు సారథ్యంవహించిన చెన్నారెడ్డి తన పార్టీని అధికారంలోకి తేగలిగారన్న ప్రతిష్ఠ దక్కించుకున్నారు.

# 14. రెండవ పర్యాయం ముఖ్యమంత్రి

1978లో వలనే తన ప్రత్యర్థుల ఎత్తులను చిత్తు చేసిన చెన్నారెడ్డి శాసనసభ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షునిగా ఏకగ్రావంగా ఎన్నికై 1989 డిసెంబర్ 3వతేదీన నిజాంకళాశాల మైదానంలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో రాష్ట్ర ముఖ్యమంత్రిగా రెండవ పర్యాయం ప్రమాణస్వీకారం చేశారు. గవర్నర్ కుమద్‌బెన్‌జోషి ఆయనతో పదవీ ప్రమాణం చేయించారు. తన 19 మంది సభ్యులు మంత్రివర్గంలో తొలివిడతగనే ఆయన అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించారు. తమ విమర్శకులకు కూడా ఆయన మంత్రిపదవులు కట్టపెట్టారు.

అయితే, మంత్రిత్వ శాఖల విభజన జరిగిన మరుక్షణంనుండే తాము ఆశించిన శాఖలు దొరకనివారు, మంత్రి పదవులు దొరకని కొందరితో చేతులు కలిపి, తమ నాయకునికి వ్యతిరేకంగా కుట్రలు కుహనాలు ప్రారంభించారు.

ముఖ్యమంత్రికావాలని విఫలయత్నంచేసిన నేదురుమల్లి జనార్ధనరెడ్డి, శాశ్వత అసమ్మతీయుడు అని పేరుపొందిన డాక్టర్ వై.యస్. రాజశేఖర్ రెడ్డి అసమ్మతీయులకు తమ ఆశీర్వచనాలు తెలిపారు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

రామారావు చిన్నాభిన్నం చేసి వెళ్లిన పాలనా యంత్రాంగాన్ని తిరిగి పట్టాలపై పెట్టటం, పాలనా సంస్కరణల పేరుతో ఆయన అసంగతంగా అమలు జరిపిన నిర్ణయాలను సమీక్షించడం, ఆర్థికవనరులు సమీకరించే మార్గాలను యోచించడం, గత ఏడు సంవత్సరాలుగా విస్మరించిన అభివృద్ధి కార్యక్రమాలకు మళ్ళీ శ్రీకారం చుట్టడం, దళితులు వెనుకబడిన వర్గాలను నిజంగా మేలు చేసే పథకాలను రచించడం, నిరుద్యోగులకు ఉపాధి కల్పించేమార్గాలు అన్వేషించడం తన ప్రధానధ్యేయంగా నూతన ప్రభుత్వం నిర్ధారించుకున్నది.

శాంతి భద్రతలు సలక్షణంగా ఉంటేనే ఏ అభివృద్ధి కార్యక్రమాలైనా అవాంతరాలు లేకుండా అమలు జరుగుతాయనే విషయం ఇతరులందరికంటే ఎక్కువ డాక్టర్ గారికి తెలుసు. అందువలన అశాంతికి హత్యలకు, పోలీసుల ప్రతిహత్యలకు ఆగడాలకు కారణభూతమైన నక్సలైట్ ఉద్యమానికే దానికి ప్రేరణ కల్పించిన పరిస్థితిని సరిదిద్దాలని ముఖ్యమంత్రి సంకల్పించారు. ఈ సదుద్దేశ్యంతో ఆయన ఉద్యమకారులకు స్నేహహస్తం ఇవ్వ జూపి, చట్టాన్ని ఉల్లంఘించకుండా నియమానుగుణంగానే నడుచుకొనవలసినదిగా పోలీసు యంత్రాంగాన్ని ఆదేశించారు.

కొన్ని జిల్లాలో అమల్లో ఉన్న కల్లోలిత ప్రాంతాల చట్టాన్ని ఎత్తివేయడం ద్వారా పోలీసు, ప్రభుత్వ యంత్రాంగ ప్రత్యేక అధికారాలను రద్దుచేశారు. హింసా రహితంగా తన విధానాలను సిద్ధాంతాలను బహిరంగ సభల ద్వారా తదితర ప్రజాస్వామ్యం పద్ధతుల ద్వారా ప్రజలకు చెప్పుకునే హక్కు తొలి పర్యాయం డాక్టర్‌గారి ప్రభుత్వం కమ్యూనిష్టు పార్టీ మార్క్సిస్ట్ లెనినిస్ట్ వర్గాలకు ప్రసాదించింది. ఈ గ్రూపులలో ఉన్నవారందరూ జన స్రవంతిలో కలిసి రాష్ట్ర పురోభివృద్ధికి తోడ్పడాలని విజ్ఞప్తి చేస్తూ కొంత కాలంగా కారాగారాలలో ఉన్న తీవ్రవాదులువారి అభిమానులను విడుదల చేసేందుకు ప్రభుత్వం ఉత్తర్వులు చేసింది. దారుణహత్యలు దహనాలకు సంబంధించిన పెద్దకేసులు మినహా

అపరిష్కృతంగా ఉన్న పెట్టీ కేసులన్నింటినీ కోర్టులనుండి ఉపసంహరించు కోవాలని కూడ ప్రభుత్వం నిర్ణయించింది.

వివిధ అంశాలు క్షుణ్ణంగా చర్చించి వేగవంతంగా నిర్ణయాలు తీసుకునేందుకు వీలు కల్పించటానికి ముఖ్యమంత్రి అయిదు వేరువేరు మంత్రివర్గ ఉపసంఘాలు ఏర్పాటు చేశారు. ఇవి ఆర్థిక వ్యవహారాలు; వ్యవసాయం, గ్రామీణాభివృద్ధి తదనుబంధ వ్యవహారాలు; బలహీన వర్గాల సంక్షేమం, సాంఘిక సేవ; రాజకీయ పర, శాసనసభ వ్యహారాలు చూచేందుకు రూపొందించబడినాయి.

ప్రజాస్వామ్యంలో మూలస్తంభాలు అని పేర్కొనబడే గ్రామపంచాయితీ లకు పుష్టి కల్పించి వాటికీ ప్రభుత్వానికీ మధ్య వారధులైన పంచాయితీ రాజ్ సంస్థల అధికారాలను నిధులను హెచ్చించి ఈ సంస్థల దైనందిన కార్యక్రమా లలో మంత్రుల జోక్యాన్ని ముఖ్యమంత్రి నిషేధించాడు. 1990-91 సంవత్సరం లో బలహీన వర్గాల కొరకు రెండు లక్షల గృహాలు నిర్మించడం కనీసం లక్షమంది నిరుద్యోగులకు ఉపాధి కల్పించడం తన లక్ష్యంగా నిర్ధారించుకున్న ప్రభుత్వం మత్స్యకారులు, చేనేతకార్మికులు, గీత కార్మికులు మొదలైనవారి అభివృద్ధికొరకు పధకాలు రూపొందించి, నీటిపారుదల, పారిశ్రామికాభివృద్ధికి పథక రచనచేశారు.

ఎన్నికల వాగ్దానాలను దృష్టిలో ఉంచుకొని, రాష్ట్ర శాసనమండలి పునరుద్ధరణకు, రాష్ట్రంలో మూడు ప్రాంతాల అభివృద్ధిపై ప్రత్యేక శ్రద్ధ కేంద్రీకరించేందుకు మూడు ప్రాంతీయ అభివృద్ధి సంఘాలను ఏర్పాటు చేసేందుకు వీలు కల్పించే శాసనం రూపొందించవలసినదిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ శాసన సభలో తీర్మానం ఆమోదించింది.

1990లో కోస్తా ప్రాంతంలో సంభవించిన తుఫాను నాలుగైదు జిల్లాలలో బీభత్సాన్ని సృష్టించగా యుద్ధ ప్రాతిపదికన సహాయకచర్యలు చేబట్టి ప్రజలను ఆదుకున్న చెన్నారెడ్డిగారు తుపానుల తాకిడిని తక్కువ నష్టంతో ఎదుర్కొనేందుకు కొన్ని శాశ్వతచర్యలు గైకొనాలని సంకల్పించారు. ఈ సంకల్ప పరిణామమే

తీర ప్రాంతంలో శాశ్వత ఆశ్రయాల నిర్మాణానికి దోహదమయింది. 1990 సంవత్సరం మధ్య భాగంలో చికిత్స నిమిత్తం ఆయన అమెరికాలో ఉన్నపుడు పూర్వ స్నేహితుల సహాయం పొంది తన స్వంత పలుకుబడితో ప్రపంచ బ్యాంకు నుండి ఎంతో రుణ సహాయం సాధించడం జరిగింది. ఈ సొమ్ములో 900 కోట్ల రుపాయిలు పై చిలుకు మొత్తం కోస్తాలో కాలువల పూడికతీత మరమ్మతులకు, మురుగునీటి తొలగింపునకు ఉద్దేశించబడినది. డాక్టర్ గారు దూరదృష్టితో ఈ బృహత్తర కార్యక్రమంచేపట్టకపోతే తుపాన్లు సంభవించి నప్పుడల్లా నష్టం అధికంగా ఉండెడిదని గుర్తించిన స్థానిక ప్రజలు ఆయనను తమ పాలిట దేముడుగా భావించారు. ఈ కార్యక్రమాలు చెన్నారెడ్డి గారు రచించి ప్రారంభించినా ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు పూర్తి అయ్యాయి.

అయితే, ఆయన అమెరికాలో చికిత్స పొందుతున్న సమయంలో రాష్ట్రంలో అసమ్మదీయులు మానవత్వం మరిచి చెన్నారెడ్డి వ్యతిరేక కార్యకలాపాలు ముమ్మరం చేయగా, ఢిల్లీలో కొందరు నాయకులు వారి కి అండదండలు కల్పించారు. అమెరికానుండి ఆయన తిరిగి వచ్చిన తరువాత శాసన సభలో ప్రభుత్వం పై పెట్టబడిన అవిశ్వాస తీర్మానం వీగిపోయింది. అక్టోబర్ మాసంలో ఆంధ్ర పర్యటనకు వచ్చిన శ్రీ రాజీవ్‌గాంధీ ఎట్టి పరిస్థితులలో ముఖ్యమంత్రిని మార్చడం జరగదని ప్రకటించారు. కానీ ఆ తరువాత కొద్దిరోజులకే ముఖ్యమంత్రి ప్రత్యర్థులు ఆయనను దెబ్బతీసేందకు అతినీచమైన పథకాలు రూపొందించారు.

హైదరాబాదు పాతనగరంలో డిసెంబర్ మొదటివారంలో ఆకస్మికంగా మతకలహాలు చెలరేగాయి. ఏడవతేదీ జరిగిన కత్తి పోటు సంఘటనలలో పలువురు మృతి చెందారు. ఎందరో గాయపడ్డారు. ఈ సంఘటనలకు ముఖ్యమంత్రి వైఫల్యమేకారణమని పేర్కొంటు ఆయన మంత్రివర్గ సహచరుడైన యన్. శ్రీనివాసులురెడ్డి తన మంత్రిపదవికి రాజీనామాచేశారు. ముఖ్యమంత్రులను వెన్నుపోటు పొడవడంలో ఆయన నిష్ణాతుడు. అల్లర్లు

విజృంభించడంతో సైనికదళాలను రంగంలోకి దింపి కనిపిస్తే కాల్చివేసే ఉత్తర్వులు ఇచ్చినా పరిస్థితి అదుపులోకి రాలేదు. ఈ సంఘటనల వెనుక తమ ప్రత్యర్థులైన కాంగ్రెస్‌వాదుల రహస్యం హస్తం ఉన్నదని రహస్య నివేదికలద్వారా తెలుసుకున్న డాక్టర్ గారు ఎంతో మన స్థాపానికి గురియై, మత కలహాల సంఘటనకు నైతిక బాధ్యతను తనపై వేసుకుంటూ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు.

1990 డిసెంబర్ 16వతేదీన ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ కాంగ్రెస్‌పక్షం నాయకుడుగా ఎన్నికైన నేదురుమల్లి జనార్ధనరెడ్డి ముఖ్యమంత్రిగా పదవీబాధ్యతలు చేపట్టిన మరుక్షణమే మత సంఘర్షణలు ఎక్కడికక్కడే ఆగిపోవడం గమనార్హం.

1989 ఎన్నికలలో తన పార్టీ పరాజయం పొందడంవలన అధికారం కోల్పోయి ప్రతి పక్షనాయకుడుగా ఉన్న రాజీవ్‌గాంధీ, చెన్నారెడ్డి ప్రత్యర్థులుగా అసమ్మదీయులను రెచ్చకొట్టిన ఆంధ్రపార్లమెంటు సభ్యులను అదుపుచేయలేక పోయారు. అయితే ఆయన చెన్నారెడ్డితో సత్సంబంధాలు కొనసాగించారు. రెండవ పర్యాయంకూడ తమ పదవీకాలం పూర్తికాకుండానే చెన్నారెడ్డిగారు పదవినుండి వైదొలగడం రాష్ట్రవ్యాప్తంగా ఆయన అభిమానులకేకాక ప్రత్యేకించి తెలంగాణ ప్రజలలో అధిక సంఖ్యాకులకు మనస్థాప కారణమైనది. రాష్ట్ర నాయకత్వం తెలంగాణా నాయకుల చేతులలో ఉండడం ఆంధ్రనాయకులకు ఆమోద యోగ్యం కాదనే అభిప్రాయం ధ్రువపడేట్టుగానే 1973లో పి.వి. నరసింహారావు నిష్క్రమణ కూడ జరిగింది. అంతకుముందు ఆంధ్ర తెలంగాణ నాయకుల మధ్య కుదిరిన ఒప్పందసారాంశం చెల్లజాలదని హైకోర్టు తీర్పు ఇవ్వగా అదిచెల్లుతుంది అని 1972లో సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చిన దరిమిలా తల ఎత్తిన ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమం సాధించింది ముఖ్యమంత్రిగా పి.వి. తొలగింపు తప్ప మరేమిలేదనేది ఇక్కడ గమనించాలి.

## 15. రాష్ట్ర ముఖ్యమంత్రులలో సచ్చీలులెవరు?

1978-79లో ముఖ్యమంత్రిగా ఉండగా ఆయన ప్రత్యర్థులు చెన్నారెడ్డిగారికి అవినీతి ముద్ర తగిలించారు. అయితే, ఫలానావారికి ఇంత దోచిపెట్టినందున ఇంత ప్రతిఫలం చెన్నారెడ్డిగారు ఫలానా వారినుండి స్వీకరించారని ఇతమిద్ధంగా ఎవరూ చెప్పలేదు. ఇదిగో పులి అంటే అదిగో తోక అన్నట్టు చెన్నారెడ్డికి వ్యతిరేకంగా ప్రచారం జరిగింది. ఇతర రాజకీయ నాయకుల వలనే రెడ్డిగారు కూడా పార్టీ నిధులు వసూలు చేసి ఉంటారు. లేకుంటే రాష్ట్రంలో పార్టీ నిర్వహణ, శ్రీమతి గాంధీపై కేసులు నడిచిన సందర్భంలో ఖర్చులకు, ఢిల్లీలో కాంగ్రెస్ పార్టీ నిర్వహణకు ఆయన నిధులు సమకూర్చ గలిగేవారు కాదు. అందువలన రెడ్డిగారుపార్టీకి నిధులు వసూలు చేసి ఉంటారు తప్ప ఆయన స్థిరచరాస్తులను పెంచుకున్న దాఖాలాలు లేవు. అధికారంలో ఉన్న వారికి సన్నిహితంగా ఉన్నవారు తమ సహాయం కోరిన వారినుండి ధనం స్వీకరించడం, కొన్ని సందర్భాలలో అధికారంలో ఉన్నవారిపేరు చెప్పి ధనం స్వీకరించడం గురించి మనం నిత్యం వింటూనే ఉన్నాము. అలాగే, చెన్నారెడ్డి అప్రతిష్ఠపాలు కావడానికి ఆయన మిత్రులు

అనుయాయులు కారకులై ఉంటారు. రెండవ పర్యాయం ముఖ్యమంత్రిగాఉన్న సందర్భంలో తన మంత్రివర్గ సహచరుడు కోనేరు రంగారావు నిధులు వసూలు చేసినట్లు ఆరోపణలు వెలుగు చూడగానే రెడ్డిగారు నిర్దాక్షిణ్యంగా ఆయనను మంత్రివర్గంనుండి వైదొలగించిన విషయం రహస్యంకాదు.

తాము అంతకుముందు సంపన్నులు కాకున్నా అధికారంలోకి రాగానే రెండు చేతులా సంపాదించి కోట్ల రూపాయల వ్యయంతో రాజప్రాసాదాల వలె భవనాలు నిర్మించుకుని స్థిరచరాస్తులు పెంచుకున్నవారు మన రాష్ట్రంలోనే ఎందరో ఉన్నారు. మంత్రికాక ముందు, వారి సింగిల్ రూమ్ టేన్మెంట్ యజమాని మాత్రమే అయిన ముఖ్యమంత్రి, పదవినుండి వైదొలగేనాటికి అనేక కోట్ల రూపాయలు సంపాదించి, తోటలు, కోళ్లు, పశువుల పెంపకం క్షేత్రాలకు వ్యాపార సంస్థలకు యజమాని, భాగస్వామి అయిన విషయం చెన్నారెడ్డిని విమర్శించినవారు ఎలా విస్మరించారో అర్థంకాదు. అక్రమ సంపాదనలో ఈ పెద్దమనిషికి అన్నగారేతప్ప తమ్ముడు కాదని రుజువు చేసుకున్నా ముఖ్యమంత్రి పదవి కొద్దికాలం నిర్వహించిన మరొక నాయకుడు ముఖ్యమంత్రి పదవిని అలంకరించిన అనంతరం తన పేర తన కుటుంబ సభ్యుల పేర ఎన్టీరామారావుగారు సంపాదించిన కోట్ల రూపాయల విలువగల స్థిరాస్తులన్నీ ఆయన కష్టార్జితమేనా? ఈ ప్రశ్నలు ఎవరూ నిక్కచ్చిగా సమాధానం చెప్పజాలనివి. అయితే ముఖ్యమంత్రి కాక పూర్వం తమ పేర కుటుంబ సభ్యుల పేర ఉన్న స్థిర చరాస్థుల కంటే ఎక్కువ ఫలానా చోట ఉన్నవని చెన్నారెడ్డి గారి విషయంలో స్పష్టీకరించినవారులేరు. ఆశ్చర్యకర విషయమేమిటంటే అక్రమ సంపాదనకు పాల్పడిన కొందరు రాజకీయ నాయకులే ఆయనను విమర్శించడం దురదృష్టకరం. అందుకని ఈ గురిగింజల ప్రకటనలు చూస్తుంటే దయ్యాలు వేదవాక్యాలు పలుకుతున్నట్టు అనిపిస్తుంది. వీరికి ఆత్మ పరిశీలన చేసుకొనే సంస్కారం లేదు. ఇలాంటివారు డాక్టర్‌గారిని విమర్శించి తమను తాము అవమానపరుచు కున్నారు.

# 16. రాజస్థాన్ గవర్నర్‌గా

మేనెల 1991లో లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికల సందర్భంలో ఆంధ్రప్రదేశ్‌లో వివిధ స్థానాలకు అభ్యర్థులను ఖరారు చేసే జాబితాకు తుదిగా ఆమోదిం తెలిపే ముందు కొన్ని నియోజక వర్గాల విషయంలో రాజీవ్‌గాంధీ చెన్నారెడ్డి గారితో టెలిఫోన్‌లో సంప్రదించారు ఎన్నికలు ఒక విడత పూర్తిఅయిన అనంతరం రాజీవ్ గాంధీ ఘోరహత్యకు గురైనారు. దివంగతనేతకు శ్రద్ధాంజలి ఘటించేందుకు చెన్నారెడ్డిగారు జిల్లా సందర్శించగా ప్రణబ్‌ముఖర్జీ, కె.యన్.సింగ్, హెచ్ కెయల్ భగత్‌తో సహా అప్పుడు బాధ్యతాయుత పదవులలో ఉన్నవారు తదితర సీనయర్ నాయకులు కూడా రెడ్డిగారు బసచేసిన రాజా, రాధారెడ్డిగారి ఇంటికి వెళ్లి డాక్టర్‌గారి సలహా కోరడం జరిగింది. రాజారెడ్డి ఆయన శ్రీమతి రాధారెడ్డి ఆమె చెల్లె విశ్వవిఖ్యాత నర్తకులు, వారు రెడ్డి గారికి బంధువులు కూడా. ఆయన అభిమానం చూరగొన్నవారు.

రాజీవ్ గాంధీ హత్యానంతరం ఆయన వారసుని వేటలో నెలకొన్న గందరగోళ పరిస్థితిలో నాటి ఆంధ్ర ముఖ్యమంత్రి జనార్ధన్‌రెడ్డి మరెందరో

రెడ్డి ప్రముఖులు శరత్‌పవార్ కొమ్ముకాశారు. అయితే డాక్టర్ చెన్నారెడ్డి, రాష్ట్రపతి భవన్‌లో విడిదిచేసి ఉన్న మాజీ రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు మాత్రం పార్టీ అధ్యక్ష పదవికీ, తరువాత ప్రధానమంత్రి పదవి పి.వి. నరసింహారావుగారే అన్ని విధాల అర్హత గల మనిషిగా భావించి ఆయనకే తమ వంతు సహాయం చేశారు. అయితే, తన ముక్కుముందే జరుగుతున్న అవినీతి కార్యకలాపాలను పి.వి. నరసింహారావు చూచి చూడనట్లు ఊరుకోవడం, పత్రికలు ప్రచురిస్తున్న ఆరోపణలు పరిగణనకు తీసుకొనక పోవడంపట్ల చెన్నారెడ్డిగారు ఎంతో కలత చెందారు. నేను మద్రాస్‌లో ఆయనను సందర్శించినప్పుడు ఎన్నో పర్యాయాలు మేము నాటి దురదృష్టకర పరిస్థితి గురించి చర్చించడం జరిగింది.

పి.వి. నరసింహారావు మంత్రి మండలి సూచనమేరకే రాష్ట్రపతి వెంకట్రామన్ 1992 ఫిబ్రవరి మాసంలో చెన్నారెడ్డి గారిని రాజస్థాన్ గవర్నర్‌గా నియమించారు. అప్పుడు అక్కడ ఉన్న బి.జె.పి. ప్రభుత్వ ముఖ్యమంత్రి బైరన్ సింగ్ షేఖావత్‌తో గవర్నర్ సలహాలు ఎంతో విలువైనవిగా భావించి గౌరవించారు. రాష్ట్ర అభివృద్ధి, ప్రయోజనం ముఖ్యమంత్రి మనసులో ప్రధానస్థానం ఆక్రమించు కొని ఉండడంవల్ల రాష్ట్ర శ్రేయస్సు పటిష్టమైన పరిపాలన కొరకు గవర్నర్ ఏ సూచన చేసినా దానిని ముఖ్యమంత్రి అనవసర జోక్యంగా భావించేవారు కారు.

1992 డిసెంబర్ మాసంలో బాబ్రీమసీదు కూల్చి వేసిన అనంతరం బి.జె.పి. ప్రభుత్వాలన్నీ బర్తరఫ్ అయిన సందర్భంలో రాజస్థాన్‌లో రాష్ట్రపతి పాలన విధించబడింది. రాష్ట్ర అవసరాలు, పాలనా విధానం ప్రజల సాంప్రదాయాలు అలవాట్ల గురించి అప్పటికే గవర్నర్‌కు క్షుణ్ణమైన అవగాహన ఉండడంవల్ల యంత్రాంగంలో ఎవరేమిటో ఆయన ఎరిగి ఉన్నందున ఏ సలహాదారు అవసరం లేకుండానే రెడ్డి గారు స్వయంగా రాజ్యపాలన భారాన్ని నిర్వహించి అందరి మన్ననలు పొందారు. పింక్‌సిటీ అని పేరు పొందిన జైపూర్ నగరంలో "పింక్" మాయమైపోతున్నదనే సంగతి గ్రహించిన చెన్నారెడ్డి ఆ

పట్టణానికి పూర్వవైభవాన్ని కల్పించే చర్యలు తీసుకొని యాత్రికులకు ఇబ్బంది కారణాలు తొలగించారు. రాష్ట్రపతి పాలన అమలులో ఉన్నందున గవర్నర్ తమ చెప్పు చేతులలో ఉండగలరని భావించిన కాంగ్రెస్ నాయకులకు రెడ్డిగారు స్వతంత్రంగా వ్యహరించడం ఆశాభంగాన్ని కలుగజేసింది.

# 17. తమిళనాడుకు అపారసేవ

తమిళనాడులో భీష్మనారాయణ పదవీకాలం పూర్తి అయినందున రెడ్డిగారిని అక్కడికి పంపడం వాంఛనీయమని ప్రభుత్వం భావించింది. శ్రీ భీష్మనారాయణ ముఖ్యమంత్రి జయలలిత చెప్పు చేతులలో ఉండి ఆమె గీసిన గీటు దాటకుండా గవర్నర్ పదవీ బాధ్యతలు నిర్వహించేవారు. అవినీతికి మారు రూపంగాను, నియంతగాను వ్యవహరించిన ముఖ్యమంత్రి జయలలితపై ఎన్ని ఫిర్యాదులు వచ్చినా గవర్నర్ పరిగణనలోకి తీసుకొనలేదు. జయలలితపై న్యాయస్థానాలలో ఫిర్యాదు చేసేందుకు అనుమతి కోరుతూ డి.యం.కే నాయకుడు కరుణానిధి జనతా పార్టీ నాయకుడు సుబ్రహ్మణ్యస్వామి పెట్టుకొన్న దరఖాస్తులను కూడా గవర్నర్ పరిశీలనకు స్వీకరించలేదు. జయలలిత ఆశీర్వచనాలు ఉన్న కొందరు అధికారులు రాజకీయ నాయకులు కూడా నియంతలుగా వ్యవహరించడంతో రాష్ట్రంలో శాంతిభద్రతలు మృగ్యమై గుండా రాజ్యం చోటుచేసుకున్నది. ముక్కు సూటిగా నడుచుకుంటూ తాను జారీ చేసిన చట్ట వ్యతిరేక ఉత్తర్వులను అమలు జరుప నిరాకరించిన

అధికారులపై జయలలిత ఆమె సహచరులు దాడులు జరిపించిన సంఘటనలు కూడా పత్రికలు వెల్లడిచేశాయి.

ఈ పరిస్థితిలో 1992 మే 31వ తేదీన డాక్టరుగారు తమిళనాడు పాండిచ్చేరి రాష్ట్రాల గవర్నర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించారు. తమిళనాడులో శాంతిభద్రతలు సక్రమంగా లేవనే అంశాన్ని గవర్నర్ తన తొలి పత్రికా గోష్ఠిలోనే అంగీకరించడం ముఖ్యమంత్రికి ఆగ్రహ కారణమైనది. అంతేకాక జయలలిత ప్రభుత్వాన్ని అదుపులో పెట్టేందుకే కేంద్ర ప్రభుత్వం సమర్థుడైన గవర్నర్‌ను తమిళనాడు పంపించిందని పత్రికలు అభిప్రాయపడ్డాయి. ఈ వార్తల వలన కినుక వహించిన జయలలిత గవర్నర్‌ను పూర్తిగా నిర్లక్ష్యం చేయనారంభించారు. ప్రభుత్వాధినేత రాష్ట్ర ముఖ్యమంత్రి మధ్య విభేదాలు సుబ్రహ్మణ్యస్వామి ఉదంతం పరాకాష్ఠకు చేరుకున్నాయి. అనేక సాక్ష్యాధారాలతో జయలలితపై సుస్పష్టమైన అవినీతి ఆరోపణలు చేసేందుకు అనుమతి కోరుతూ గవర్నర్‌కు పిటీషన్ దాఖలు చేశారు. స్వామి వాదనలను ఓపికతో విని తనకు అందిన పత్రాలు పరిశీలించిన గవర్నర్ తొందరపడి తను ఏ నిర్ణయం గైకొనకుండా అనేక మంది న్యాయశాస్త్ర కోవిదులతో సంప్రదింపులు జరిపారు. తనకు అనుమతి ఇవ్వడంలో గవర్నర్ చేస్తున్న జాప్యాన్ని శ్రీ స్వామి న్యాయపరంగా కూడా సవాలు చేశారు. 1995 ఏప్రిల్ మాసంలో రాష్ట్ర గవర్నర్, ముఖ్యమంత్రిపై న్యాయస్థానానికి వెళ్లేందుకు సుబ్రహ్మణ్యస్వామికి అనుమతి ఇచ్చారు. తనపై వచ్చిన ఆరోపణలలో నిజానిజాలు నిగ్గుతేల్చేందుకు న్యాయస్థానాలను ఆశ్రయించవలసిన ముఖ్యమంత్రి గవర్నర్‌ను బెదిరించేందుకు గుండాయిజాన్ని ఆయుధంగా ప్రయోగించారు. పర్యటనలలో గవర్నర్ ప్రయాణానికి ఎడియంకే కార్యకర్తలు అడ్డుతగులగా పోలీసులు వారిని నివారించలేదు. రాజభవన్ వద్ద నిరసన ప్రదర్శనలు జరుపుతున్న జయ అనుయాయులను వారు అడ్డుకొనలేదు.

గవర్నర్ అంటే ఏమిటో ముఖ్యమంత్రికి తెలియచెప్పాలనుకున్న రెడ్డిగారు తన రక్షణకు సి.ఆర్.పి.యఫ్ బలగాలను తెప్పించుకొని రాష్ట్రంలో పోలీసు యంత్రాంగం సిగ్గుతో తలవంచుకునేట్టు చేశారు.

తాము నిర్వహిస్తున్న పదవుల కారణంగా విధిగా ఇద్దరు పాల్గొనవలసి వచ్చిన సభలు సమావేశాలలో ముఖ్యమంత్రి గవర్నర్ ఎడముఖం పెడముఖంగా కూర్చోవడం చూపరులకు ఆశ్చర్యం కలుగజేసేది. రిపబ్లిక్‌డే సందర్భంలోను, రాష్ట్రపతి ప్రధానమంత్రి నగరానికి వచ్చినపుడు ఆయా స్థలాలకు ముందుగా వెళ్లి ప్రొటోకాల్ ప్రకారం గవర్నర్‌కు స్వాగతం చెప్పవలసిన ముఖ్యమంత్రి అలా చేసేది కాదు. ఆమె ఈ తెలివితక్కువ తలబిరుసు అలవాటును గవర్నర్ పట్టించుకునేవారు కాదు. ఆమె తననేదో అవమానం చేస్తున్నట్టు ఇతరులు చేసే వాదనతో ఆయన అంగీకరించేవారు కాదు. ప్రజాప్రతినిధులు ఎవరైనా తాము పదవిలో ఉన్నా లేకున్నా ప్రేమఆదరాభిమానాలతో ప్రజలు గౌరవించేట్టు వినయంగా ప్రవర్తించాలి తప్ప అధికారం చేతుల్లో ఉన్నదని తలకు పొగరు ఎక్కనిస్తే అధికారం పోయిన పిదప పరిస్థితి ఏమిటో అర్థం అవుతుంది అని చెన్నారెడ్డిగారు వ్యాఖ్యానిస్తుండేవారు. పత్రికల వారిని కూడా ఆమె చెదపురుగుల వలే చూచింది. ముఖ్యమంత్రి పదవి నుండి వైదొలగగానే ఆమెను అందరూ చీడపురుగుకంటే హీనంగా చూడడం మొదలుపెట్టారు. అయితే గవర్నర్ మాత్రం తమకు అవకాశం దొరికినా ఆమె పట్ల అమర్యాదగా ప్రవర్తించలేదు.

గవర్నర్‌ను ఘాటుగా బహిరంగంగా విమర్శించిన నేపథ్యంలో ఒకసారి ఆమె గత్యంతరం లేక డాక్టర్‌గారిని సందర్శించవలసి వచ్చింది. ఆమె తన మంత్రివర్గ సహచరులను కొందరిని తొలగించి కొందరిని కొత్తగా మంత్రివర్గంలో చేర్చుకొనవలసిన సందర్భం అది. ప్రమాణ స్వీకారానికి ముహూర్తం నిశ్చయం చేసుకొని ఆమె తన కార్యదర్శిని, గవర్నర్ కార్యదర్శి వద్దకు పంపించి గవర్నర్

కార్యక్రమాలలో ప్రమాణ స్వీకారోత్సవం చేర్చబడేట్టు చూడాలని ప్రయత్నించింది.

గవర్నర్ ఆమరుసటి ఉదయం వారంరోజుల అధికార పర్యటనపై వెళ్లనున్నందున ప్రమాణ స్వీకారోత్సవానికి ఏర్పాటు కుదరదని గవర్నర్ కార్యదర్శి శ్రీమతి శీలాప్రియ ముఖ్యమంత్రి కార్యదర్శికి తెలియజేసింది.

ఈ వార్త తెలిసి బెంబేలుపడిన ముఖ్యమంత్రి హుటాహుటిన గవర్నర్‌ను సందర్శించేందుకు అనుమతికోరింది. రెడ్డిగారు ఆమె తనను కలుసుకునేందుకు ఉదారంగా వెంటనే అంగీకరించారు. గవర్నర్‌ను కలుసుకున్న జయలలితకు ఏమి మాట్లాడాలో అర్థం కాలేదు. నీళ్లు నములుతూ కూర్చొని తను అవాకులు చవాకులు మాట్లాడినందుకు గవర్నర్ మందలించగలరేమోనని జంకింది. కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత డాక్టరుగారు అప్పటి వరకు తాము చూస్తున్న ఫైలును (నటన) తన టేబిల్‌పై పెట్టి, చిరునవ్వునవ్వి "నువు చాలా బలహీనంగా కనిపిస్తున్నావు, ఆరోగ్యం చెడిపోయినట్లుంది. డాక్టర్‌ను సంప్రదించలేకపోయావా' ' అన్నారు. ఆమె నవ్వలేక నవ్వుతూ, "బాగానే ఉన్నానండీ. థాంక్స్" అన్నది. అంతకు ముందే జయలలితను ప్రాసిక్యూట్ చేసేందుకు తాము జనతా నాయకుడు డాక్టర్ సుబ్రహ్మణ్యస్వామికి అనుమతి ఇచ్చినందున, మదన పడుతున్నట్టున్నావు. డాక్టర్ సుబ్రహ్మణ్యస్వామిని ఆశ్రయించలేకపోయావా అనే భావం వచ్చేట్టు ద్వందార్థపూరిత వ్యాఖ్య చేశారు చెన్నారెడ్డి. విషయం ఆమె గ్రహించకపోలేదు. కానీ గవర్నర్ తనపై ఆగ్రహం వెల్లడించకపోవడమే ఆమెకు ఆశ్చర్యకారణమైంది.

తరువాత ఆమె నీళ్లు నములుతూ సవినయంగా తాను వచ్చిన పని చెప్పి, ప్రమాణ స్వీకార ఉత్సవం ఆ మర్నాడు జరుగకపోతే తనకు ఇబ్బందులు ఎదురవగలవనీ మంత్రిగా చేరవలసిన వ్యక్తిని అనుకున్నట్టు మంత్రివర్గంలో చేర్చుకొనలేకపోతే పాలనా యంత్రాంగం ముందు తాను చులకనకాగలనని

ఆమె విన్నవించింది. తొణకక బెణకక తన కుర్చీలో కూర్చున్న గవర్నర్ క్షణం ఆలోచించి తనదైనందిన కార్యక్రమ డైరీని పరిశీలించి, తన కార్యదర్శికి కబురు పంపించారు. కార్యదర్శి వచ్చే వరకు జయలలితను చెన్నారెడ్డి నవ్వుతూనే సూటీపోటీ మాటలతో పొడిచి చంపాడు. ఆయన మాటలు వినేవారికి అభినంద నలుగా అనిపించినా ఆ వ్యాఖ్యలలో ఇమిడి ఉన్న ద్వంద అర్థాన్ని వాటి వాడిని వేడిని గ్రహించిన జయలలిత "స్టేట్స్‌మెన్"గా చెన్నారెడ్డిగారి విశ్వరూపం ఎలా ఉంటుందో అవగాహన చేసుకున్నారు.

తను అతిధిగా పాల్గొనదలిచిన కార్యక్రమాల నిర్వాహకులకు బాధ అసౌకర్యం కలుగకుండా వారితో సంప్రదించి తన కార్యక్రమంలో స్వల్ప మార్పులు చేసి ప్రమాణస్వీకార ఉత్సవాన్ని కూడా పొందు పరచవలసినదిగా గవర్నర్ తన కార్యదర్శికి చెప్పిన అనంతరం ప్రశాంతగా ముఖ్యమంత్రి తిరుగు ముఖం పట్టింది. డాక్టరుగారు ఈ విషయం నాకు చెప్పినప్పుడు పొట్ట చెక్కలయేట్టు నవ్వుతూ మేకలు పులులా నటిస్తే జయలలిత ఎదుర్కొన్న ఇరకాట పరిస్థితి ఎదుర్కోవడం తప్పదని చెప్పడం ఆయన మాటలలో నీతిని నేను అర్థం చేసుకొని అభినందించగలిగాను.

రాష్ట్రంలో 17 విశ్వవిద్యాలయాలకు అధ్యక్షుడు (ఛాన్సలర్)గా ఉన్న గవర్నర్ ఉపాధ్యక్షులతో సత్సంబంధాలు పెట్టుకొని విద్యాప్రమాణాలు పడిపోకుండా నిరోధించేందుకు కృషి చేశారు. ఛాన్సలర్ హోదాలో విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులతో తనకున్న సత్సంబంధాలలో కొందరు ఆంధ్ర ప్రముఖులకు చెన్నారెడ్డి గౌరవ డాక్టరేట్ పట్టాలు ఇప్పించారు. 1996లో అన్నామలై విశ్వవిద్యాలయం పార్లమెంట్ సభ్యుడు బి.ఎన్.రెడ్డికి ఇలాంటి పురస్కారాన్ని అందచేసింది. సుప్రసిద్ధ వాస్తు శిల్పి ప్రముఖ ఇంజనీర్ అయిన బి.ఎన్.రెడ్డి అమెరికా తదితర దేశాలలో తను పొందిన అనుభవంతో నగరంలో

ఎన్నో బహుళ అంతస్తుల భవనాలు, కాలనీలు నిర్మించి వేలాది కుటుంబాలకు సరసధరలకు నివాసాలు కల్పించి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్నారు. రెండో పర్యాయం మిర్యాలగూడ నియోజకవర్గంనుంచి లోక్‌సభ సభ్యుడుగా ఎన్నికైన ఆయన కవి, రచయిత, కాకతాళీయంగా డాక్టర్‌కు సన్నిహితులు కూడా. అయితే శ్రీ బద్దం నరసింహారెడ్డిగారితో పాటు వివిధ రంగాల్లో ప్రాచుర్యం పొందిన మరికొందరికి కూడా డాక్టర్‌గారు పట్టాలు ప్రదానం చేయించారు. వీరిలో నిర్మాత, దర్శకుడుగా చలనచిత్ర రంగంలో తనకంటూ ఒకస్థానం సంపాదించుకున్న రచయిత మల్లెమాల ఎం.ఎస్.రెడ్డి కూడా వున్నారు.

వివిధ పార్టీలకు చెందిన పలువురు పార్లమెంట్ సభ్యులే కాక రాజకీయ, రాజకీయేతర ప్రముఖులు ఎందరెందరో ఢిల్లీలో డా॥ బి.ఎన్.రెడ్డిగారిని కలుసుకుని తమ నివాస, వ్యాపారసంస్థల భవనాలు సందర్శించి వాస్తుశాస్త్ర సంబంధిత సూచనలు చేయాలని ఆయనను కోరడం పరిశీలిస్తే డా॥ చెన్నారెడ్డిగారు, బహుముఖ ప్రజ్ఞాశాలియైన బి.ఎన్.రెడ్డిని సత్కరించాలనుకోవడం ఎంతో సమంజసమైన నిర్ణయమని ఎవరికైనా అనిపిస్తుంది. వాస్తుశాస్త్రం గురించి సులభశైలిలో బి.ఎన్. రచించిన గ్రంథం బహుళ ప్రచారం పొందటమే ఆయనను కలుసుకోవాలని పలువురు భావించడానికి కారణమైంది.

ఉపాధ్యక్షులుగా తాను సూచించిన వ్యక్తుల నియామకం విషయంలో గవర్నర్ తమకు అనుమతి తక్షణం ఇవ్వనందుకు ఆగ్రహించిన జయలలిత విశ్వవిద్యాలయాల చట్టాన్నే సవరించి శాసనసభ ఆమోదం పొందారు. ఈ సవరణ వల్ల గవర్నర్ నిర్వాహకంలో ఉండే ఛాన్సలర్ హోదా ఆమె తమకు కల్పించుకున్నారు. "ఎంత వరకు పోతావో పో నేనూ నీ సత్తా ఏమిటో చూస్తాను' ' అని పరోక్షంగా ముఖ్యమంత్రికి తెలియజేసిన గవర్నర్, విశ్వవిద్యాలయాల చట్టం సవరణ బిల్లుకు తన ఆమోదాన్ని నిరాకరించడం అది నిరర్థకమైపోయింది.

ఈ సవరణ, ముఖ్యమంత్రి విశ్వవిద్యాలయాలన్నింటికీ అధ్యక్షురాలు, ఛాన్సలర్‌గా వ్యవహరించే అధికారం కల్పించేందుకు ఉద్దేశించబడింది.

గవర్నర్‌ను శాసనసభ్యులు నిందించడాన్ని విమర్శించడాన్ని నిషేధించే నియమాన్ని ప్రతి శాసనసభ పాటించినట్టే తమిళనాడు శాసనసభ అనాదిగా పాటిస్తున్నది. అయితే జయ ప్రభుత్వం రెడ్డిగారిపై అక్కసుతో గవర్నర్ చర్యలను శాసనసభలో విమర్శించకూడదు అనే నియమాన్ని రద్దు చేయించింది. అందువల్ల అధికారపార్టీ శాసనసభ్యులు సభలో పరుషవ్యాఖ్యానాలతో గవర్నర్ చర్యలను విమర్శించి వార్తాసంస్థల ద్వారా ప్రచారం పొందారు. "కానీయండి రా బిడ్డలారా మీకు పోయేకాలం దగ్గరపడుతున్నది" అనే ధోరణిని గవర్నర్ అవలంబించారు. తద్వారా రెడ్డిగారు "గండ్రడ గండ్రడు జయలలిత పాలిట యముడు" అనే పేరు తెచ్చుకున్నారు. పరిస్థితి ఇలా కొనసాగుతుండగా 1996 శాసనసభ ఎన్నికలలో జయలలిత పార్టీతో పొత్తుకు రావాలని కాంగ్రెస్ అధిష్ఠానవర్గం నిర్ణయించిన దరిమిలా తమిళనాడులో కాంగ్రెస్ నామమాత్రంగా మిగిలింది. సీనియర్ కాంగ్రెస్ నాయకులందరూ పార్టీని బహిష్కరించి ప్రాంతీయ పార్టీ ఏర్పాటు చేసుకున్నారు.

1966లో జరిగిన లోక్‌సభ ఎన్నికలతో పాటే తమిళనాడు శాసనసభకు ఎన్నికలు జరుగగా జయలలిత అన్నాడియంకె, పి.వి.నరసింహారావు కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులు డిపాజిట్లు కోల్పోయి నామరూపాలు లేకుండా కాలగర్భంలో కలిసిపోయారు. అధికారపార్టీ తప్ప అన్ని పార్టీలతో గవర్నర్ సత్సంబంధాలు పెట్టుకున్నందున రాష్ట్రంలో డియంకె ప్రభుత్వాన్ని స్థాపించిన ముఖ్యమంత్రి యం.కరుణానిధి గవర్నర్ వ్యవస్థపట్ల చూపవలసిన గౌరవాన్ని చూపి రెడ్డిగారిపట్ల అచంచల భక్తివిశ్వాసాలను ప్రదర్శించారు. అధికారంలోకి రాగానే కరుణానిధి తొందరపాటు చర్యలేమీ తీసుకొనకుండా చట్టపరిధిని ఏమాత్రం అతిక్రమించ

కుండా నడుచుకోవడానికి కారకులు, ప్రేరకులు చెన్నారెడ్డిగారేనని చెబితే అతిశయోక్తి కాజాలదు. చెన్నారెడ్డిగారు నవంబర్ మాసాంతాన తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి గారితో పరిపాలనా సంబంధిత విషయాలు ఎన్నింటినో హైదరాబాదులో చర్చించడం జరిగినట్టు తెలిసింది. ఏది ఏమైనా గవర్నర్ పదవి ప్రతిష్ఠ కాపాడి ఆ పదవిలో ఉన్న వారి అధికార పరిధులకు కొత్త నిర్వచనం కల్పించిన ప్రముఖ రాజకీయ వేత్తగా చరిత్రలో చెన్నారెడ్డిగారి పేరు సువర్ణాక్షరాలతో లిఖించబడి ఉంటుంది.

# 18. దొడ్డ గుణాలుకల విశాల హృదయుడు

1950-1960 దశకాలలో తెలంగాణా ప్రజల హక్కుల పరిరక్షణకు సుదీర్ఘ పోరాటాలు జరిపిన చెన్నారెడ్డి గారు ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర ఉద్యమాలకు అధిపత్యం వహించినా పట్టు విడుపులను అవలంబించడం ద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమగ్రతను కాపాడారు. ఈ సందర్భంలో తెలంగాణా ప్రాంతంలో కొందరికి తనపై ఆగ్రహం కలిగినా చెన్నారెడ్డి సర్దుబాటు స్వభావం చూపారు. ఉద్యమాలలో పాల్గొన్నా ఆంధ్రప్రాంతం వారిని అయన ఏనాడూ దూషించలేదు, ద్వేషించలేదు. ఏ పదవిలో వున్నా ఆయన పేషీలో ఉద్యోగుల నియామకంలో ప్రాంతీయ కులతత్వాలకు ఆస్కారం ఇవ్వలేదు.

శ్రీ ఎస్.ఆర్. రామమూర్తి, కె. సంతానం, కె.ఆర్. పరమహంస వంటి సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారులను, ఏ ఆర్ మురళీధర్, రాజు గారివంటి పోలీసు అధికారులను వెతికి వెతికి తన సహాయకులుగా నియమించుకున్నారు. వారందరూ రెడ్డిగారికి కన్న పిల్లలువలె విశ్వాసపాత్రంగా సేవచేశారు. ముఖ్యమంత్రి ప్రజా సంబంధాల అధికారిగా చెన్నారెడ్డిచే నియమితులైన

భండారు పర్వతాలరావు తలవంచుకుని తన పనేదో తాను నిజాయితీగా చేసుకుని వెళ్ళే అధికారిగా ఆ తరువాత ముఖ్యమంత్రుల మన్ననలు పొందారు.

ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో తనను విమర్శించడమే కాక భూతంలా చిత్రించిన పలువురు ఆంధ్రప్రాంత నాయకులపై కూడా ఆయన ద్వేష భావం చూపలేదు. పైగా భవనం వెంకటరామ్‌తో సహా తన రాజకీయ ప్రత్యర్థులు కొందరితో ఆయన స్నేహం కూడా చేశారు. తెలంగాణా ప్రాంతంలో ఉన్నట్టే ఆంధ్ర రాయలసీమ ప్రాంతాలలో కూడా చెన్నారెడ్డి గారికి విశ్వాస పాత్రులైన మిత్రులు వీరాభిమానులు ఉండడం గమనార్హం. తన పేసీలోనే కాక మొత్తంగా ప్రభుత్వ యంత్రాంగం విషయంలోనే చెన్నారెడ్డిగారు ఎపుడూ ప్రాంతీయ విచక్షణ చూపలేదు. 1978లో 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వ పత్రిక సంపాదకత్వానికి తెలంగాణా ప్రాంతానికి చెందిన ఒక రెడ్డి కులస్థుడుని నియామకం దాదాపు ఖరారైన అనంతరం నేను ఏ.బి.కె. ప్రసాద్ పేరును సూచించగా, గూఢచారి శాఖవారు ఆయన ఎంపికకు అంతకుముందే రాజకీయ కారణాల వలన వ్యతిరేకించినా లెక్కచేయక తక్షణం ప్రసాద్‌ను ఎడిటర్‌ను చేశారు.

నలభై సంవత్సరాల మా సుదీర్ఘ పరిచయంలో డాక్టర్‌గారు నాపై మూడుసార్లు ఆగ్రహించారు. కొంతకాలం నేను వారిని కలుసుకోవడం మానివేసేవాడిని. అనంతరం వారే నన్ను పిలిపించుకొని మాట్లాడేవారు. తొలి పర్యాయం నానల్‌నగర్ గ్రామం వద్ద ఒక గుడిలో ప్రజా సమితి కార్యవర్గ రహస్య సమావేశంలో మా యిద్దరి మధ్య తీవ్ర వాగ్వివాదం ఘర్షణ వరకు వెళ్ళడం నేను సమావేశం నుండి వాకౌట్ చేయడం జరిగింది. తరువాత కొన్ని నెలలకు నేను అప్పుడే ప్రారంభమైన నక్సలైట్ ఉద్యమం గురించి తెలుసుకునేందుకు శ్రీకాకుళం జిల్లాలో విస్తృతంగా పర్యటించి "డైలీన్యూస్"

దినపత్రికలో కొన్ని వ్యాసాలు వ్రాశాను. ఈ వ్యాసాలు కొన్నిభాగాలను జాతీయ స్థాయి పత్రికలు కొన్ని పునర్ముద్రించాయి. చెన్నారెడ్డిగారు ఈ వ్యాసాల గురించి చర్చించాలన్న సాకుతో అప్పటి మా ఎడిటర్ నాగేశ్వరరావుగారికి ఫోన్ చేసి నన్ను పిలిపించుకున్నారు. తరువాత మా సాన్నిహిత్యం మళ్ళీ కొనసాగింది. తన మేలుకోరే చిత్తశుద్ధికల అందరి వ్యక్తుల విషయంలో రెడ్డిగారు ఈ విధంగానే వ్యవహరించేవారు. రెండవ పర్యాయం వారితో నాకు ఘర్షణ 1980లో ముఖ్యమంత్రి పదవి నుండి వైదొలగడానికి కొన్ని మాసాల ముందు జరిగింది.

1980లో కేంద్రంలో ఇందిరాగాంధీ నేతృత్వంలో తిరిగి కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన కొద్ది రోజుల తరువాత చోప్రా అనే ఒక స్నేహితుడు హైదరాబాద్ వచ్చారు. బంజారాహిల్స్ హోటల్‌లో నేను అతనితో మాట్లాడుతున్న సమయంలో కొమ్మినేని శేషగిరిరావు, వి. పురుషోత్తమరెడ్డిగారు కనిపించారు. పురుషోత్తమరెడ్డిని పరిచయం చేసిన సందర్భంలో "ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారికి వీరు సన్నిహితులు" అని నేను పేర్కొన్నాను. కొద్ది నిముషాల తరువాత పురుషోత్తమరెడ్డి వెళ్ళిపోయినా మా సంభాషణ కొనసాగింది. "చెన్నారెడ్డిని ముఖ్యమంత్రి పదవినుండి మార్చి ఆయన స్థానంలో అంజయ్యను ముఖ్యమంత్రిని చేయాలనే ఉద్దేశం సంజయ్‌గాంధీకి ఉన్నది. దానికి శ్రీమతి గాంధీ కూడా అంగీకరించారు" అని నాతో చెప్పిన చోప్రా "ఈ విషయం నీ మనసులోనే ఉంచుకో" అని చోప్రా చెప్పారు.

వృత్తిరీత్యా ఆ సాయంత్రం సచివాలయంలో నేను ముఖ్యమంత్రి కార్యాలయానికి వెళ్ళగా ఆయన లోపల గదిలో ఏకాంతంగా కూర్చుని తనకు వచ్చిన లేఖలు, మహజర్లు చదువుకుంటున్నారు. తనకు వ్యతిరేకంగా ఢిల్లీలో ఏదో పథకం రూపొందుతున్నదని డాక్టర్‌గారికి చెప్పాలనుకున్నాను. నేను లోనికి వెళ్ళి పిచ్చాపాటి మాట్లాడుతూ చోప్రా పేరు ఎత్తకుండా నాకు తెలిసిన విషయం చూచాయగా తెలిపాను.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

ఆ రోజు ఏదో కార్మికుల సమ్మె జరుగుతున్నది. సమ్మె పరిస్థితి చర్చించేందుకు డిజిపి నారాయణరావుగారు, లేబర్ కమిషనర్, మరికొందరు అధికారులు ముఖ్యమంత్రి కార్యాలయానికి వచ్చారు. సమావేశం మొదలైంది. ఈలోగా అప్పుడు కేంద్ర కార్మిక సహాయమంత్రిగా వున్న అంజయ్య ముఖ్యమంత్రికి ఫోన్ చేసి సమ్మె పరిస్థితులు తెలుసుకోదలిచారు. డాక్టర్‌గారు వేరే విషయం మాట్లడకుండా "అంజయ్యగారూ మీరు ముఖ్యమంత్రి బాధ్యత ఎప్పుడు స్వీకరిస్తారు" అని పెద్దగా నవ్వారు. తన పేరు పరిశీలనలో వున్న సంగతి అప్పటికీ అంజయ్యకే తెలియదు. చెన్నారెడ్డిగారు మనసులో మాట దాచుకోలేరు. బయటపడిపోతారు అనడానికి ఇదొక నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

ఒక రోజు నేను సమాచార భారతి ప్రధాన సంపాదకునికి టెలిప్రింటర్‌పై ఒక సందేశం పంపుతూ చెన్నారెడ్డి మంత్రివర్గంలో ఏడెనిమిది మంది సభ్యులు ముఖ్యమంత్రి పట్ల అసంతృప్తితో ఉన్నారని తెలిసినదని, తిరుగుబాటు బావుటా ఎగరవేయవలసిందిగా వారిని కొందరు కేంద్ర నాయకులు ప్రోత్సహిస్తున్నారని దాఖలాలు నాదగ్గర ఉన్నాయనే విషయం పేర్కొని కేంద్రమంత్రులతో ఈ విషయం గురించి విచారించవలసిందిగా కోరాను. ఈ సందేశం ముఖ్యమంత్రి అధికార నివాసంలో ఉన్న సమాచార భారతి టిక్కర్ మిషన్‌పై కూడా విడుదలై చెన్నారెడ్డి దృష్టికి వెళ్ళింది. వెనువెంటనే ముఖ్యమంత్రి రాష్ట్రంలో రాజకీయ పరిణామాల గురించి గూఢచారి సంస్థ అధిపతితో చర్చించారు. "మంత్రులు అసంతృప్తిగా వున్న సంగతి నా దృష్టికి రాలేదు" అని గూఢచారి శాఖాధికారి పి.ఎస్. రామమోహనరావు గారు బల్లగుద్ది చెప్పగా అప్పుడు ముఖ్యమంత్రి వద్ద వున్న ఒక మంత్రి నాపై చాడీలు చెప్పి నేను చెన్నారెడ్డిగారిని ప్రయివేటు సంభాషణలలో విమర్శచేస్తున్నట్లు తెలియజేశారు. అంతకుముందు, చెన్నారెడ్డిగారి సహాయం వల్ల నేను ఆ మంత్రి అహం దెబ్బతీయడం జరిగింది.

అందువలన ఆ మంత్రి నాపై ఆగ్రహంగా వున్నాడు. ఎలాగైనా నన్ను రెడ్డి గారికి దూరం చేయాలని భావించారు. ముఖ్యమంత్రి నుండి నాకు టెలిఫోన్ వచ్చింది. మొదట పి.ఆర్.ఓ. పర్వతాలురావు గారు నాతో మాట్లాడుతూ రెడ్డిగారు చాలా ఆగ్రహంతో వున్నారని నన్ను హెచ్చరించి వినయంగా మాట్లాడవలసిందిగా సూచించారు.

"సార్ నేను మా ఎడిటర్‌కు పంపిన సందేశం మీ మనస్సుకు కష్టం కలిగించి ఉంటుంది. స్వయంగా వచ్చి మీతో సవివరంగా మాట్లాడుతాను. దయతో మీరు నాకు కొంత సమయం ఇవ్వాలి" అన్నాను. నేను ఏమిచెప్పినా వినేందుకు సిద్ధంగా లేని ముఖ్యమంత్రిగారు ఎంతో ఆవేశంతో "చిట్టుపొట్టు థర్డ్‌రేట్ జర్నలిస్టులతో మాట్లాడేందుకు నాకు టయం లేదు" అని టెలిఫోన్ పెట్టేశారు. అప్పుడు నా అహం కూడా దెబ్బతిన్నది. ఆ రాత్రే నేను మంత్రి జి. రాజారామ్‌గారిని మరికొందరు అసమ్మదీయులను భోజనానికి మా యింటికి ఆహ్వానించాను. సందర్భం ఏమిటంటే వారికి చెప్పాలి కనుక టెలిఫోన్స్ జనరల్ మేనేజర్ బాలసుబ్రహ్మణ్యం గారిని కూడా భోజనానికి పిలిచానని అందువల్ల మిత్రులైన మంత్రులనూ కంపెని కొరకు పిలవాలనుకున్నానని చెప్పాను.

ఆ రాత్రి రెండు గంటల వరకు మా సంభాషణలు కొనసాగాయి. మంత్రులు చెన్నారెడ్డి పట్ల ఆగ్రహంతో వున్నారని 60 - 70మంది శాసనసభ్యులు ఈ మంత్రులకు అండ తెలియజేశారని కేంద్ర నాయకులు అసమ్మదీయులకు ఆశీర్వచనం తెలిపారని తెలిసింది. మర్నాడు తిరిగి నేను రాజారామ్ గారిని కలుసుకోగా అసమ్మతికి సంబంధించిన వార్త నీ మనసులోనే ఉంచుకోవాలి తప్ప బయటపెట్టవద్దని కోరారు. అయితే మళ్ళీ నేనూ మా ప్రధాన సంపాదకునికి రహస్య సందేశం పంపుతూ రాజకీయ పరిస్థితి వివరించాను. ఇది ముఖ్యమంత్రి ఇంట్లో మిషన్‌పై మళ్ళీ లీక్ అయింది. ఈ విషయం చదివి చెన్నారెడ్డిగారు

ఆగ్రహించారు. అప్పుడు ఆయన కార్యదర్శిగా పనిచేస్తున్న ఐఎఎస్ అధికారి పరమహంసగారు జోక్యం చేసుకుని "ఆదిరాజు సమాచారం మనం నిర్లక్ష్యం చేయకూడదు సర్, ఆధారం లేకుండా అతనేమీ వ్రాయడు అని సవినయంగా చెబుతుండగా రెడ్డిగారు వేగంగా తమ బంగళాపైకి వెళ్ళారు.

ఒకరోజు నేను సచివాలయంలో మంత్రి ఎడ్లపాటి వెంకటరావు గారిని కలుసుకొనగా రాజకీయ పరిస్థితి ఏమిటి అని వారు నన్ను అడిగారు. నేను ఆయన కార్యాలయానికి వెళ్ళి ప్రధానమంత్రి కార్యాలయానికి గానీ, ఇంటికి గానీ ఎస్.టి.డి. కలపమని మీ పి.ఎస్.కు చెప్పండి అన్నాను. వెంటనే వెంకటరావుగారు హేమచంద్రప్రసాద్‌గారికి ఈ బాధ్యత అప్పగించారు. కనెక్షన్ దొరకగానే ప్రధానమంత్రి సలహాదారుతో, ప్రత్యేక కార్యదర్శితో నా సంభాషణ 'ప్యార్లల్' టెలిఫోన్‌లో విన్న వెంకటరావుగారు అసమ్మదీయులతో రహస్యంగా చేతులు కలపడానికి నా సహాయం కోరారు. ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకు అన్నపూర్ణ హోటల్‌లో ఫలానా నెంబర్ గదిలో వెంకటరావు గారితో అసమ్మతి వర్గీయులలో ఒక మంత్రిని కలిపే ఏర్పాటు చేసేందుకు నేను అంగీకరించాను. అక్కడనుండి వెళ్ళేటప్పుడు వెంకటరావుగారి లెటర్ పేడ్ నాతో పట్టుకెళ్ళాను.

అసమ్మతివర్గ నాయకులు శేషావతారం, మదనమోహన్‌గారు నాకు తక్షణం దొరకలేదు. రాజారాంగారి ఇంటికి వెళ్ళితే మంత్రి విశ్రాంతి తీసుకుంటున్నారని ఆయన పి.ఎస్. రామ్‌రెడ్డిగారు తెలిపారు. అర్జెంట్ పని ఉన్నదని చెప్పి నేను రాజారామ్‌గారి బెడ్‌రూంలో ప్రవేశించేసరికి ఆయన లేచారు. వెంకటరావుగారి విషయం చెప్పగా ఆయన ససేమిరా నమ్మలేదు. నిజామాబాద్ జిల్లా శాసనసభ్యుడు శ్రీనివాస్‌రావు, వీరమాచినేని బుజ్జి అంతకుముందే వెంకటరావుగారితో మాట్లాడారని ఆయన చెన్నారెడ్డిగారిని

వదిలేందుకు ఏ పరిస్థితుల్లోను సిద్ధంగా లేరని రాజారాం చెప్పారు. కొంత సంభాషణ అనంతరం, ఒక ప్రయివేటు వాహనంలో నాతోపాటు 4గంటలకు అన్నపూర్ణ హోటల్‌కు వచ్చేందుకు రాజారాంగారు అంగీకరించడంతో ఈ విషయం తెలిపేందుకు వెంకటరావు గారికి టెలిఫోన్ చేశాను. అప్పటికి వెంకటరావుగారు భోజనం కూడా చేయకుండా నా టెలిఫోన్ కొరకు నిరీక్షిస్తున్నారు అని పి.ఎస్. హేమచంద్రప్రసాద్ గారు చెప్పారు.

ఆశ్చర్యం ఏమిటంటే వెంకటరావుగారి నైతిక విలువలు. "ప్రజా జీవితంలో ఉన్న నాలాంటి విద్యావంతులకు సచ్ఛీలత ఉండాలి. కారెక్టర్ లేకుంటే మిత్రులు హర్షించరు. అందువలన నేను రాజారామ్‌గారిని రహస్యంగా కాక బహిరంగంగానే ఆయన ఇంట్లోనో, కార్యాలయంలోనో కలుసుకునేందుకు సిద్ధంగా వున్నాను" అన్నారు. తరువాత ఇద్దరూ ఫోన్‌లో మాట్లాడుకున్నారు. తక్షణమే నేను ఆఫీసుకెళ్ళి 24గంటలలో మరొక మంత్రి అసమ్మదీయుల శిబిరంలో చేరనున్నారనే వార్త టెలిప్రింటర్‌పై పంపించాను. అప్పటివరకు వెంకటరావుగారిని ఎవరూ అనుమానించలేదు కనుక మంత్రి ఎవరా అనే విషయం ముఖ్యమంత్రి నివాసంలో కలకలానికి దారితీయగా, ఈ వార్త అబద్ధమని గూఢచారులు తేల్చిచెప్పారు. అయితే, పరమహంసగారు మాత్రం నూటికి నూరు పాళ్ళు ఈ వార్త యదార్థమే అయిఉంటుంది అని ముఖ్యమంత్రికి చెప్పారు.

ఆ రోజు నేను చాలా మనస్థాపాన్ని పొందాను. ముఖ్యమంత్రి ఇంటి నుండి టెలిఫోన్ వస్తుందేమోనని చూశాను. రాలేదు. మర్నాడు ప్రధానమంత్రి ఇంటినుండి టెలిఫోన్ చేసి ఒక మిత్రుడు నాకు అభినందనలు తెలియజేశారు. డాక్టర్‌గారు వాస్తవాలు తెలుసుకొనకుండా ఓపిక కోల్పోయినన్ను తిట్టిన తిట్లు మళ్ళీ నా మనసును కలిచివేశాయి. ఆ సాయంత్రం నాటి విద్యామంత్రి భవనం వెంకటరాం గారి ఇంటికి టెలిఫోన్ చేయగా ఆ సమయానికి ఆయన ఇంట్లో

లేరు. ఎంత పొద్దుపోయినా సరే మంత్రిని మా యింటికి తీసుకొని రావలసిందని మంత్రి ప్రైవేటు కార్యదర్శి శ్రీరాములు గారికి చెప్పాను.

సుమారు పదకొండు గంటలకు భవనమ్ వెంకటరాం శ్రీరాములు గారు మాయింటికి రాగానే జరగబోయే రాజకీయ పరిణామాల గురించి నేను చెబితే అయన నమ్మలేదు. నేను ఎస్.టి.డిలో ప్రదానమంత్రి ఇంటికి మాట్లాడిన అనంతరం అసమ్మదీయులతో చేరేందుకు భవనం అంగీకరించారు. అయితే పి.వి. నరసింహారావు స్వయంగా తనకు చెబితే తప్ప, తాను తుది నిర్ణయం గైకొనజాలనని భవనం షరతు పెట్టారు. అప్పుడు రాత్రి 12గంటలయింది. శేషావతారం ఇంట్లో ఎవరు టెలిఫోన్ తీయలేదు. మదనమోహన్‌గారి ఇంటికి టెలిఫోన్ చేయగా వెంటనే ఆయన ఫోన్ తీసుకొని హలో అనగానే నా గొంతు గుర్తుపట్టి ఏమిరా ఆదిరాజు ఇంత అర్ధరాత్రి ఫోన్ చేశావు అని అడిగారు. విష యం తెలియజేసి వెంకటరామ్‌కు టెలిఫోన్ ఇచ్చాను. ఇద్దరూ మాట్లాడుకున్నారు. ఆ సాయంకాలం అధికారిక కార్యక్రమంపై భవనం గారు ఢిల్లీ వెళ్తున్నారని మర్నాడు మధ్యాహ్నం నాకు తెలిసింది. ఆ ఉదయం చాలా సేపు ఆయన ముఖ్యమంత్రిగారితో సమాలోచన జరిపి విద్యాశాఖకు సంబంధించి ఢిల్లీలో తాము చర్చించవలసిన విషయాలు గురించి వివరించారని తెలిసింది. 24 గంటలలో మరొక మంత్రి అసమ్మదీయులలో చేరే అవకాశం ఉన్నదని నేను వార్త పంపాను. పై ఉదంతాలలో నా పాత్ర నిమిత్త మాత్రం కాకతాళీయమైనది.

ఒక విషయం ఇక్కడ ఉదహరించక తప్పదు. ఆగ్రహం వచ్చినా అనుగ్రహం కలిగినా డాక్టర్‌గారికి పట్టపగ్గాలు ఉండవు. వెన్నలాంటి హృదయం విశాలస్వభావంతో తన శత్రువులు రాజకీయ ప్రత్యర్థులను డాక్టర్‌గారు మిత్రులను అభిమానులుగా మలచుకొనగలిగినా, తననోటిదురుసు తొందరపాటుతనం వల్ల ఆయన అభిమానం నటిస్తూ నమ్మించి గొంతుకోసే వారి విషయంలో అప్రమత్తతగా ఉండడం ఎవరికైనా కష్టమే. శ్రీమతి గాంధీ తనకు ద్రోహం చేయగలదని మంత్రివర్గ సహచరులను, శాసనసభ్యులను తన నాయకత్వాన్నే సవాలు చేసేట్టు రహస్యంగా పురమాయించగలదని

చెన్నారెడ్డి ఊహించియుండరు. తను అప్రతిష్ఠ పాలవగలనని తెలిసి కూడా శక్తివంచన లేకుండా చందాలు వసూలు చేసిపెట్టారు చెన్నారెడ్డి ఆమెకు పార్టీకి ; మెదక్ నియోజకవర్గం నుండి పోటీచేయవలసిందిగా ఆహ్వానించి లోక్‌సభకు గెలిపించారు. మూడు కారణాలవలన చెన్నారెడ్డి చేసిన ఉపకారాన్ని విస్మరించిన శ్రీమతి గాంధీ ఆయనపై కక్ష పెంచుకున్నారు. తనకుమారుడు సంజయ్‌గాంధీకి అడుగులకు మడుగులొత్తేందుకు చెన్నారెడ్డి నిరాకరించడాన్ని ఆమె క్షమించ లేకోయింది. పార్టీకి, ఆమెకు ఎన్ని నిధులు సమకూర్చినా, తను ఆశించినంత మొత్తంలో ఆమెకు ఆయన ముట్టచెప్పలేకపోయారు. మూడవది అన్నింటికంటె ముఖ్యమైనకారణం చెన్నారెడ్డి రాజకీయంగా బలోపేతులు కావడం ఆమె సహించలేకపోయింది. ఇతర పార్టీల అభ్యర్థులుగాను, స్వతంత్రులుగాను ఎన్నికైన శాసనసభ్యులు కాంగ్రెస్‌లో చేరి చెన్నారెడ్డి నాయకత్వాన్ని బలపరచడాన్ని గత్యంతరంలేక పార్టీ అధిష్ఠానవర్గం ఆమోదించినా వ్యక్తిగతంగా ఆమెకు ఈ పరిణామం నచ్చలేదు. కారణాలు ఏమైనా కారకులు ఎవరైనా కొన్ని పత్రికలు కొందరు పత్రికా రచయితలు ముఖ్యమంత్రికి పచ్చి వ్యతిరేకులై ఒక పద్ధతి ప్రకారం చెన్నారెడ్డిగారికి వ్యతిరేకంగా దుష్ప్రచారం సాగించారు. ఇది ఆమెకు తోడ్పడింది. తాను నమ్మిన వారి వల్లనేడాక్టర్‌గారు వంచనకు గురైన విధానాన్ని వివరించేందుకే అందుకు సంబంధించిన అనేకుదంతాలలో మచ్చు తునకలు ఇక్కడ ఉదహరించాను.

తనకు పత్రికా విలేఖరులపై ఎంత అగ్రహం కలిగినా, వారిపై యజమానులకు ఫిర్యాదు చేసి వారిని ఉద్యోగాల నుండి పంపించే అలవాటు డాక్టర్‌గారికి లేదు. అగ్రహం కలిగితే విలేఖరినే చివాట్లు పెడుతారు తప్ప అతని పొట్టపై కొట్టరు. ముఖ్యమంత్రులుగా చేసిన వెంగళరావు, విజయభాస్కరరెడ్డి స్వభావం ఇందుకు పూర్తిగా భిన్నమైంది. వారు తమకు గిట్టని, తమను విమర్శిస్తూ వ్రాసిన విలేఖరుల ఉద్యోగాలు పీకించారు. వారిని వేధించారు. నేదురమల్లి జనార్ధన్‌రెడ్డి తను ప్రభావితం చేయలేని విలేఖరులకు అపకారం చేసేందుకు ఎంతటి నీచస్థాయికైనా దిగగల సమర్ధతగల నాయకుడు.

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

ఎంతో ఆలోచనాపరుడైన డా॥ రెడ్డిగారు  ఆవేశపరుడనీ, ఆవేశం ఆయనకు ఎన్నో సందర్భాలలో అపకారం చేసినదని చెప్పేందుకు  పై విషయాలు వ్రాయవలసి వచ్చింది. ఆయన కొన్ని సందర్భాలలో కోపిష్టిగా కనపడుతారు తప్ప గర్విష్టికాదనే విషయం  నాకు బాగా తెలుసు. అయినా నేను మానవమాత్రుడునే కదా! తాను అనుకున్నది సాధించాలనే పట్టుదలకు, తాను మంచిది అనుకున్న పని కాకుండా ఎవరైనా అడ్డుతగిలినప్పుడు ఆయన సంయమనం కోల్పోయి ఎంతో కోపాన్ని, తాపాన్ని వెల్లడిస్తారు. అయితే అన్ని అభిప్రాయాలు తెలుసుకున్న అనంతరమే క్షుణ్ణంగా ఆలోచించి ఆయన ఒక నిర్ణయానికి వస్తారు.  ఈ ఆగ్రహ లక్షణమే ఆయనను తన మంత్రులకు దూరం చేసింది. పైకి కరుకుగా కనిపించినా వెన్నలాంటి మనస్సుకల చెన్నారెడ్డిని అహం దెబ్బతీసింది. మా మధ్య సంబంధాలు బెడిసిన అనంతరం చాలా రోజుల తరువాత మళ్ళీ మేము సన్నిహితులమయ్యాం. గవర్నర్ అధ్యక్షతన రాజభవన్ కేంద్రబిందువుగా పనిచేస్తున్న స్వచ్ఛంద సంస్థ 'చేతన' ఎడ్మినిస్ట్రేషన్ అధికారిగా ఆ రోజులలో పనిచేస్తున్న మిత్రుడు వనం జ్వాలా నరసింహారావు ఒకరోజు ఢిల్లీ టెలిఫోన్ చేసి హుటాహుటిన నన్ను హైదరాబాద్ బయలుదేరి రావలసిందిగా కోరారు. విషయం చాలా ముఖ్యమైందని చెప్పారు. సాయంత్రం విమానంలో నేను హైదరాబాద్ రాగానే ఆ రోజులలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేఖరిగా పనిచేస్తున్న  పర్చా వెంకటేశ్వరరావు, జ్వాలా నరసింహారావు, నన్ను కలుసుకొని తక్షణం నేను చెన్నారెడ్డిగారిని సందర్శించాలని కోరారు... ఏకాంతంగా డాక్టర్‌గారు నాతో సుమారు గంటసేపు మాట్లాడారు. ఆ తరువాత మళ్ళీ మాకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. అది చివరికంటా కొనసాగింది.

రాజస్థాన్ గవర్నర్‌గా ఉన్న రోజులలో 1993 మార్చి మాసంలో  నేను జయపూర్ వెళ్లినపుడు మేము ఇద్దరం తీరికగా మాట్లాడేందుకు వీలుగా ఆ

సాయంత్రం అప్పాయింట్‌మెంట్స్ అన్నీ గవర్నర్ రద్దు చేసుకున్నారు. ఇలా అపాయింట్‌మెంట్ కోల్పోయినవారిలో నాటి కేంద్ర సహాయమంత్రి పి.వి. రంగయ్యనాయుడుగారు కూడా వున్నారు. నేను తనను కలిసిన సందర్భంలో ఒక ఫొటోగ్రాఫర్‌ను కూడా పిలిపించవలసినదిగా ఆయన తన ప్రెస్ సెక్రటరీ పర్సాను పురమాయించారు. చెన్నారెడ్డిగారు తమ ఆగ్రహాన్ని, అనుగ్రహాన్ని దాచుకోలేరు. అందుకే నేను వారితో చాలా జాగ్రత్తగా మెలిగేవాడిని. సదా ఆయనను అధ్యయనం చేసే ప్రయత్నం కొనసాగించేవాడిని. ఆయనపట్ల నాకు ఉన్న గౌరవం అపారం. ఆ సంగతి ఆయనకు బాగా విదితం.

నా దృష్టిలో సమకాలీన రాజకీయ నాయకులలో చెన్నారెడ్డిని మించినవారు లేరు. డాక్టర్‌గారు నాకు కొండంత అండ కల్పించిన రెండు ఉదంతాలు దిగువ పేర్కొంటాను. వారితో నాలాగే సహాయం పొందినవారు అసంఖ్యాకులు ఉన్నారు. ప్రముఖ న్యాయవేత్త ప్రస్తుతం లండన్‌లో భారత హైకమిషనర్‌గా ఉన్న డా॥ ఎల్.యం.సంఘ్వీగారు 1978లో నేను ఏర్పాటు చేసిన ఒక కార్యక్రమంలో పాల్గొనేందుకు హైదరాబాద్ వచ్చారు. చెన్నారెడ్డిగారిని ఆ కార్యక్రమానికి అధ్యక్షత వహించవలసినదిగా అంతకు చాలా రోజుల ముందున నేను కోరినప్పుడు సంఘ్వీగారి ప్రస్తావన రాలేదు. ఆ కార్యక్రమం గురించి నేను ముఖ్యమంత్రి డైరీలో నోట్ చేయించలేదు. కార్యక్రమానికి ఒక రోజు ముందు విచారించగా రెడ్డిగారి అధికార పర్యటన ప్రకాశం జిల్లాలో ఉన్నారని అక్కడి నుండి నెల్లూరు, చిత్తూరు జిల్లాలు పర్యటించి రెండు రోజుల అనంతరం నగరానికి తిరిగి వస్తారని తెలిసి నేనెంతో ఆందోళన చెందాను.

ధైర్యం తెచ్చుకొని ఏదైతే అది అవుతుంది అనుకుని నేను ఒంగోలు టెలిఫోన్ చేస్తే డాక్టర్‌గారు దొరికారు. నా కార్యక్రమానికి అధ్యక్షత వహించగలనని

ఆయన చేసిన వాగ్దానం విషయం గుర్తు చేయగా, "పర్యటనను రద్దు చేసుకొని రేపు ఉదయం మద్రాస్ ఎక్స్‌ప్రెస్‌లో నేను సికింద్రాబాద్ చేరుకుంటాను స్టేషన్‌కు రా" అని చెప్పారు.

దురదృష్టవశాత్తు ఆ రోజు ఆ బండి మూడు గంటల లేటు. నేను ఏర్పాటు చేసిన కార్యక్రమం ప్రారంభం కావడానికి అరగంట ముందుగా సికింద్రాబాద్ చేరుకొనవలసి ఉన్నది. ఉదయం ఈ విషయం నాకు తెలియగానే నేను వరంగల్ డి.ఐ.జి జగన్మోహన్‌గారికి ఫోన్ చేసి ఒక నోట్ డిక్టేట్ చేసి దానిని కాజీపేట స్టేషన్‌లో ముఖ్యమంత్రికి కలిసినపుడు ఒక సీల్డ్ కవర్‌లో పెట్టి ఏమీ తెలియనట్లే ఇవ్వమని చెప్పాను.

సికింద్రాబాద్ స్టేషన్‌కు రైలు చేరేసరికి డాక్టర్‌సాబ్ ఇస్త్రీ బట్టలు ధరించి ఫ్రెష్‌గా చిరునవ్వుతో కనిపించారు. నా విజ్ఞప్తి మేరకు ఆయన తన స్నానం, పూజ రైలులోనే పూర్తి చేసుకున్నారని తరువాత తెలిసింది. కార్యక్రమంలో సంఘ్వీగారి ప్రక్కన వేదికపై కూర్చున్న ముఖ్యమంత్రి వద్దకు వెళ్లి ఆయనను, ఇతర అతిథులకు రాత్రి విందు భోజనం ఏర్పాటు చేయవలసినదిగా చెవిలో రహస్యంగా చెప్పాను. కార్యక్రమం పూర్తి కాబోయే ముందర రెడ్డిగారు వారిని మధ్యాహ్న భోజనానికి ఆహ్వానించారు. అంతేకాక ఆ రాత్రి నేను వారందరికీ లేక్‌వ్యూ అతిథి గృహంలో విందు ఇచ్చేందుకు తగిన ఏర్పాట్లు కూడా చేశాను. ఇంతకు చెప్పదలచుకున్న విషయమేమిటంటే, సంఘ్వీగారు చెన్నారెడ్డిగారి ప్రత్యర్థుల న్యాయవాదిగా ఒక కేసులో సుప్రీంకోర్టు ముందు హాజరుకావడం వల్ల చెన్నారెడ్డిగారికి నష్టం జరిగింది. ఆయన ప్రతిపక్షవాదిగా పనిచేశారనే విషయం నాకు తెలియదు. ఈ పూర్వరంగంలో కూడా డాక్టర్‌గారు ఎంతో ఉదాత్తంగా వ్యవహరించారు. ఈ సందర్భంలో, కొన్ని రోజుల తర్వాత ఈ విషయంలో నేను క్షమార్పణ కోరగా, చేదు అనుభవాలు మరిచిపోయే స్వభావం

ఉన్న వారికే సుందరస్వప్నాల అదృష్టం ఉంటుంది. లేకుంటే మనిషి ఆందోళనా రహితుడుగా జీవించలేడు అన్నారాయనగారు.

ఒకరోజు తుఫాను బీభత్సాన్ని వాయుసేన విమానం నుండి సర్వే చేసేందుకు ముఖ్యమంత్రి బయల్దేరవలసి ఉన్నది. నాటి సమాచార శాఖ డైరెక్టర్ వనజాక్షి, రెవిన్యూ మంత్రి జనార్ధనరెడ్డి కలిసి ముఖ్యమంత్రి వెంట వెళ్ల వలసిన విలేఖరుల జాబితా ఖరారు చేశారు. దానిలో సమాచార భారతి వార్తా సంస్థను కావాలనే విస్మరించారు. ఈ విషయం నేను వారి దృష్టికి తేవడం వలన ప్రయోజనం లేకపోయింది. ఒక వార్తా సంస్థకు అయిదు రాష్ట్రాలకు ఇంచార్జిగా ఉన్న నేను లేకుండా ముఖ్యమంత్రి విమానం బయలుదేరదని ఆగ్రహంగా నేను నేదురుమల్లి జనార్ధనరెడ్డితో ఛాలెంజ్ చేశాను.

ముఖ్యమంత్రి కార్యాలయానికి టెలిఫోన్ చేస్తే ఆయనే భోజనానికి బయల్దేరబోతున్నారనీ సెక్యూరిటీ అధికారి ఎఆర్ మురళీధర్‌గారు చెప్పారు. “అర్జంటుగా ఒక మాట చెప్పాలి. లిఫ్ట్ దిగే వరకు నేను అక్కడ కలుస్తానని డాక్టర్ సాబ్‌కు చెప్పండి” అని మురళీధర్‌గారికి చెప్పి హుటాహుటిని వాయువేగంతో కారు నడుపుకుని సచివాలయానికి చేరుకొనగా ముఖ్యమంత్రిగారు దిగబోతున్నారనే హడవిడిగా ఉంది. రెడ్డిగారు క్రిందికి రాగానే నన్ను చూచి మాట్లాడుతూ పోదాం కార్లో ఎక్కమని చెప్పి తనతో రావలసిన హోం మంత్రి హాషీమ్‌గారిని వెనుక కారులో రమ్మని చెప్పారు. ఇతర విషయాలు మాట్లాడుతూ తార్నాకా చేరుకున్నాం. మా సంభాషణ పూర్తి కాలేదు. నన్నూ భోజనానికి లేవమన్నారు. సావిత్రమ్మగారు వడ్డించారు. సంభాషణ పూర్తి అయిన తరువాత భోజనాల చివరన నేను ఈ రోజు మీతో రాలేకపోతున్నందుకు ఎంతో బాధపడుతున్నాను. విమానంలో స్థలం లేదట నాకు అని చెప్పాను. రెడ్డిగారు వెంటనే మురళీ నాతో ఒక గెస్ట్ ఉన్నాడని ఏర్‌ఫోర్స్ వాళ్లకు చెప్పు అని

ఆదేశించారు. విమానాశ్రయానికి వెళ్లగానే నాకు అక్కడ జనార్ధన్‌రెడ్డి తారసపడి "ఏమబ్బా నేను చెప్పాను గదా చోటు లేదని మళ్లీ విమానాశ్రయానికి వచ్చావే" అన్నారు. ఈలోగా వైమానిక దళ అధికారి ఒకరు మురళీధర్‌గారి దగ్గరకు వచ్చి "ఆదిరాజు వెంకటేశ్వరరావుగారు" ఎవరు అని ఇంగ్లీషులో ప్రశ్నించి సాదరంగా నన్ను విమానం వైపు తీసుకెళుతుంటే జనార్ధన్‌రెడ్డి హతాశుడైనాడు. మరొక ముఖ్య విలేఖరికి కూడా చోటు కావాలని నేను ఆ వైమానిక దళ అధికారికి చెప్పిన ఎ.ఎన్.ఎస్ విలేఖరిగా పనిచేస్తున్న కొండా లక్ష్మారెడ్డిగారిని కూడా లోపలకు లాగాను. లక్ష్మారెడ్డిగారు చెన్నారెడ్డిగారి బంధువు.

డాక్టర్‌గారికి నాకు మధ్య ఎలాగైనా విభేదాలు కల్పించాలనే సంకల్పం ఆనాడే జనార్ధన్‌రెడ్డి మనసులో చోటు చేసుకున్నది. అసమ్మతి మంత్రుల రాజీనామా ఉదంతంలో జనార్ధన్‌రెడ్డి నాకు డాక్టర్‌గారికి మధ్య సృష్టించిన అఖాతాన్ని దృష్టిలో పెట్టుకొని 1985 శాసనసభ ఎన్నికలలో జనార్ధన్‌రెడ్డి వెంకటగిరి నియోజనవర్గంలో ఘోర పరాజయం పొందేవరకు నేను విశ్రమించలేదు. మిత్రులు అని చెన్నారెడ్డిగారు భావించిన రాజకీయ నాయకులలో పలువురు ఆయనకు ద్రోహం చేయడం వలన నాలాంటివారు సహాయం చేయాలనుకున్నా 19-9-80లో నెలకొన్న పరిస్థితిలో ప్రయోజనం ఉండేదికాదు. పైగా మంత్రుల రాజీనామా గురించి నేను మొదటనే ఇచ్చిన "హింట్" చెన్నారెడ్డిగారు సహృదయంతో స్వీకరించి ఉంటే నాకు దురుద్దేశ్యాన్ని ఆపాదించవలదని సెక్యూరిటీ అధికారి మురళీధర్, తన కార్యదర్శి పరమహంసగారు చెప్పిన విషయం చెన్నారెడ్డిగారు నమ్మి ఆయన తక్షణం ఢిల్లీ వెళ్ళి శ్రీమతి గాంధితో తాడోపేడో తేల్చుకునే ప్రయత్నం చేస్తే పరిస్థితి ఎలా ఉండేదో. చెన్నారెడ్డిగారికి జరిగిన అన్యాయం ఆయనతో సహాయం పొందిన వారి నుండి కూడా ఆయనకు జరిగిన అపకారం ఎంతోకాలం నాకు

కలత కలిగించాయి. డాక్టర్‌గారు దురదృష్టకర పరిస్థితి ఎదుర్కొనవలసి రావడం పట్ల నా శ్రీమతి ఆదిరాజు సీతాదేవి కూడా ఎంతో మథన పడేవారు. మా ఇంట్లో ఫొటో అల్బమ్‌లో మా పిల్లలతో చెన్నారెడ్డిగారి బొమ్మలు చూచినప్పుడల్లా అయనకు మన కుటుంబం ఎంతో రుణపడి ఉన్నది, సమాచార భారతి హైదరాబాద్, విజయవాడ కార్యాలయాలు ప్రారంభించి సంస్థ గురించీ మీ గురించి మంచి మాటలు చెప్పి సంస్థకు ఎంతో ప్రోత్సాహాన్ని డాక్టర్‌గారు ఇవ్వకపోతే మన పరిస్థితి ఎలా ఉండేదో అంటూ ఉండేది.

అందువలన డాక్టర్‌గారి ఉపకారాన్ని మరచిపోకుండా, 1986లో నా పుస్తకం "గాంధీ టు గాంధీ" రాష్ట్రపతి జైల్‌సింగ్ విడుదల చేసిన అనంతరం రాజీవ్‌గాంధీగారితో ఏర్పడిన సత్సంబంధాలను పురస్కరించుకొని డాక్టర్‌గారికి ఉడతా భక్తి సహాయపడే ప్రయత్నం చేశాను. ఆ తరువాత నేను "ఉదయం" పత్రిక ఢిల్లీ కార్యాలయ అధిపతిగా చేరిన అనంతరం రాజీవ్‌గాంధీ హత్య జరిగే వరకు అయా సందర్భాలను పట్టి వ్రాసిన లేఖలలో పెక్కింటిలో డాక్టర్‌గారి పేరు ప్రస్తావించి మరీ మరీ ఆయనను రాజీవ్ దృష్టికి తెచ్చే ప్రయత్నం చేశాను. అలాగే ఆ రోజులలో ఆంధ్ర వ్యవహారాలు చూచిన కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి హెచ్.కె.యల్.భగత్‌తోను ఆంధ్ర ఇంచార్జి కేంద్ర మంత్రి అజిత్‌కుమార్ పంజాగారితోను ఎన్నోసార్లు డాక్టర్‌గారి విషయం ప్రస్తావించాను. ఈ ప్రస్తావనల గురించి తెలుసుకున్న గవర్నర్ జోషీగారు నన్నెంతో అభినందించారు.

బహుశా 1990 మధ్యకాలంలో కావచ్చు మాజీ కేంద్ర మంత్రి శ్రీ పి.వి.నరసింహారావు తన కుమారుడు రంగారావుకు ఆపరేషన్ జరిగిన సందర్భంలో హైదరాబాదులో చాలా రోజులు మకాం వేశారు. ఒకరోజు ఆయన ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారితో అపాయింట్‌మెంట్ తీసుకొని వారి అధికార నివాసానికి తారనాకా వెళ్లారు. మొదటి అంతస్తులో ఉన్న చెన్నారెడ్డిగారికి

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

సకాలంలో వర్తమానం అందిందో లేదో తెలియదు కానీ సుమారు 35-40 నిమిషాలు పి.విగారు ఒక విజిటర్‌గా నిరీక్షించిన అనంతరం చెన్నారెడ్డిగారు క్రిందికి దిగివచ్చి కలిశారు. తరువాతకాలం ఢిల్లీలో జరిగిన రాజకీయ పరిణామాలతో, ముఖ్యమంత్రిగా చెన్నారెడ్డి కొనసాగుదలకు వ్యతిరేకంగా పి.విగారు రాజీవ్‌గాంధీకి నాలుగు మాటలు గుంభనంగా చెప్పి పరోక్షంగా అసమ్మదీయులకు సహకరించి ఉంటారు.

అతడెంతవాడైనాసరే, విజిటర్స్ వచ్చిన సంగతి సహాయకులు చెన్నారెడ్డిగారికి ముఖతా కానీ టెలిఫోన్‌లో కానీ చెప్పరు. కాయితంపై వ్రాసి పంపిస్తారు. తన బల్లపైకి ఏకాయితం వచ్చినా రెడ్డిగారు తక్షణం చూస్తారు. కానీ ఒక్కొక్కసారి పొరపాటు జరిగే అవకాశం ఉంటుంది. ఇలాంటి పొరపాటే పి.విగారి విషయంలో జరిగి ఉంటుంది.

పలు పర్యాయాలు నేను మద్రాస్ రాజభవన్‌లో అతిథిగా ఉన్నప్పుడు ఎ.డి.సి., ఎమ్.వి.యన్ సూర్యప్రసాద్ (ఐ.పి.యస్) కానీ మరొక ఎడిసి కానీ గవర్నర్‌కు లిఖిత పూర్వకంగా తెలపడాన్ని నేను వ్యతిరేకించేవాడిని, టెలిఫోన్‌లో చెప్పడానికి వారు నిరాకరించేవారు. కాయితం పంపే పద్ధతే చాలా మంచిదని సూర్యప్రసాద్ గారు వివరించారు. విజిటర్ పేరు సరిగా ఉచ్ఛరించకపోతే మంచిది కాదు. ఫలానా ఫలానావారు నిరీక్షిస్తున్నారని చెబితే కొన్ని సందర్భాలలో ఎవరో ఒకరి పేరు గవర్నర్ మరచిపోవచ్చు. ఫలానా వారు నిరీక్షిస్తున్నారని చెప్పి గవర్నర్‌ను ఇరకాటంలో పెట్టినట్లు అవుతుంది అనేవారాయన. ఏదిఏమైనా చెన్నారెడ్డిగారు ప్రతి పనిని ఒక పద్ధతి ప్రకారం చేస్తారు. ఆయన తన పరిసరాలను పద్ధతి ప్రకారం పరిశుభ్రంగా ఉంచుకుంటారు. తాను నమ్మిన దేవతామూర్తుల విగ్రహాలను చిత్రపటాలను ఆయన కార్యాలయంలో చక్కగా అమర్చుకుంటారు. మద్రాస్ రాజభవన్‌లో గవర్నర్‌గారి ఆఫీసు గది పుట్టపర్తి సత్యశాయి తైలవర్ణ చిత్రం మరికొన్ని చిత్రాలతో ఎంతో సుందరంగా ఉంటుంది.

# 19. ఒక ధృవతార రాలిపోయింది

ఉత్తమోత్తములు అనాయాస మరణం పొంది సరాసరి స్వర్గానికి వెళ్తారని మన శాస్త్రాలు చెబుతున్నట్లు డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారి వంటి మహావ్యక్తి ముందుగా ముహూర్తం నిర్ణయించుకున్నారా అన్నట్టు పుణ్యసమయంలో కన్నుమూశారు. ధాతునామ సంవత్సరం కార్తీక సోమవారం బహుళ సప్తమినాడు ప్రాతఃకాలాన పూజవేళ ఆయన కన్నుమూశారు. ఆయన మఖానక్షత్రాన (1996 డిసెంబర్ 2వ తేదీ ఉదయం) పరమపదించగా, డిసెంబర్ నాలుగవ తేదీ మధ్యాహ్నం మూడు గంటలకు నవమినాడు ఉత్తరా నక్షత్రంలో సర్వ సైనిక లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి.

అర్ధ శతాబ్దంపైగా రాష్ట్ర రాజకీయరంగాన్ని ప్రత్యక్షంగా పరోక్షంగా ప్రభావితం చేస్తూ అనితర సాధ్యమైన వ్యవహారశైలిలో అన్నింటా తనకు తానే సాటి అనిపించుకున్నారని చెన్నారెడ్డిగారి గురించి అభివర్ణించగా దేశంలో పత్రికలన్నీ కూడా ఆయనకు నివాళి అర్పించాయి. ఎక్కడో పరాయిగడ్డపై ప్రాణాలు కోల్పోక స్వస్థలం చేరుకొని సంతోషంగా గడిపి తన ఇంట్లోనే తుది

శ్వాస తీసుకోవడం కూడా గొప్ప విషయమే. ఆయన నిర్వహించిన తుది కార్యక్రమం ఒక వివాహానికి హాజరై నూతన వధూవరులను దీవించి రావడం. రెడ్డిగారు హైదరాబాదు వచ్చింది కూడా మనుమల వివాహాల సందర్భంలోనే. కన్నుమూసేందుకు క్షణాల ముందుగానే రెడ్డిగారు తన జీవిత భాగస్వామి సావిత్రీదేవితోను కుమారులు రవీందర్‌రెడ్డి, శశిధరరెడ్డి, కుమార్తె వసుధ అల్లుడు సుదర్శనరెడ్డి తదితర కుటుంబ సభ్యులతో మందహాసాలు చిందిస్తూ ముచ్చటించారు. అంతకు ముందు వివాహానికి హాజరైన సందర్భంలో తుది వీడ్కోలు పుచ్చుకుంటున్నారా అన్నట్లు ఆయన పలువురు బంధువులు స్నేహితులను శ్రేయోభిలాషులను కలుసుకొని వారిని మందస్మిత వదనంతో పలుకరించడం జరిగింది.

ఈ మహానాయకుడికి అన్ని పక్షాల రాజకీయ నాయకులు వివిధ రంగాలలో ప్రముఖులు అశేష జనసందోహం అశ్రునయనాలతో వీడ్కోలు పలుకగా, ప్రధానమంత్రి దేవెగౌడ మాజీ ప్రధాని పి.వి.నరసింహారావు పలువురు జాతీయ స్థాయి నాయకులు ప్రత్యేకంగా ఢిల్లీ నుండి వచ్చి శ్రద్ధాంజలి ఘటించి వెళ్లారు. పార్లమెంట్ ఉభయ సభలు రెడ్డిగారి మృతిపట్ల సంతాపం తెలిపి డిసెంబర్ 2వ తేదీన వాయిదా పడ్డాయి.

- డిసెంబర్ 9, 1996

## ముందుగానే నివారించతగింది...

చెన్నారెడ్డిగారి భౌతికకాయానికి అంత్యక్రియలు జరిగిన స్థలంలో ఆయనకు జ్ఞాపక చిహ్నం నిర్మించడం చట్టవిరుద్ధమని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు డివిజన్‌బెంచ్ తీర్పు చెప్పింది. ఈ తీర్పు ఎన్టీఆర్ జ్ఞాపక చిహ్నం విషయంలోను వర్తిస్తుంది. ఈ తీర్పు సమంజసం, సహేతుకమైనది కాదని ఎవరూ అనలేరు.

అంత్యక్రియలకు ముందుగానే స్థానికులు హైకోర్టును ఆశ్రయించినప్పుడే ప్రభుత్వం జాగ్రత్తపడి ఉండాల్సింది. సచివాలయం వెనుక భాగంలో బుద్ధపూర్ణిమ పార్కుకు ఉద్దేశించిన స్థలంలో రామారావు అంత్యక్రియలు జరపడం సర్వే సర్వత్రా నిరసనలకు దారితీసింది. చంద్రబాబు ప్రభుత్వం గైకొన్న అనేక తప్పుడు నిర్ణయాలలో ఇదొకటి. అందువలన ఒక తప్పుడు నిర్ణయాన్ని సమర్థించుకుని చెన్నారెడ్డి గారి అంత్యక్రియలు ఇందిరాపార్కులో జరిగే ఏర్పాటు చేశారు. రెడ్డిగారి కుమారులు ఇందుకు అంగీకరించి ఉండవలసింది కాదు. ఆ పార్కుతో చెన్నారెడ్డి గారికి ఏమైనా సంబంధం ఉన్నదా అంటే అదీ లేదు. వెంగళరావు గారి ప్రభుత్వం ఏర్పాటు చేయించిన పార్కు అది. శ్రీమతి గాంధీ పేరుతో కూడా రెడ్డిగారికి అవినాభావం లేదు.

జూబ్లీహిల్స్, బంజారాహిల్స్‌లో అనేక కాలనీల ఆవిర్భావానికి నగరం చుట్టూ పలు పరిశ్రమలు ఇతర సంస్థలు నెలకొనేందుకు కారకుడైన రెడ్డిగారి అంత్యక్రియలు బంజారాహిల్స్, జూబ్లీహిల్స్‌లో ఖాళీగా ప్రభుత్వ స్థలంలోఎక్కడో చెన్నారెడ్డిగారికి దహన క్రియలు జరిపి ఆ ప్రాంతాన్ని ఉద్యానవనంగా అభివృద్ధి చేస్తే ఎవరూ అభ్యంతరం చెప్పేవారు కాదు. ఇందిరాపార్కులో ఆయన అంత్యక్రియలు జరిగే ఏర్పాటు చేయడం వలన ఆ ప్రాంత నివాసులు పలువురు చెన్నారెడ్డి గారి గురించి చెడుగా గుర్తుంచు కునేందుకు అందువల్ల ఆయన ఆత్మ క్షోభించేందుకు చంద్రబాబు దోహదం చేశారు. తద్వారా చనిపోయిన అనంతరం కూడా చెన్నారెడ్డి ఆంధ్రనాయకుల వంచనకు గురైనారని ఈ రచయిత భావన.

- జనవరి 28, 1997

# గ్రంథ రచయిత మనవి

నాకు డా॥ చెన్నారెడ్డిగారితో నాలుగు దశాబ్దాల (1954 నుండి) పరిచయం ఉన్నది. డాక్టర్ సాబ్ అభిప్రాయాలతో ఏకీభవించి ఆయనకు సలహాలు ఇచ్చి, మన్నన పొందిన క్షణాలను, తీవ్రంగా విభేదించి, విమర్శించి చివాట్లు తిన్న సందర్భాలను చవిచూసి జీర్ణం చేసుకున్న పత్రికా విలేఖరిని నేను.

స్వర్గీయ నీలం సంజీవరెడ్డిగారిపై నేను రూపొందించిన టెలివిజన్ డాక్యుమెంటరీ ప్రసార సందర్భంలో చివరి భాగాలు మాత్రమే చెన్నారెడ్డిగారు కాకతాళీయంగానైనా, ఆసక్తితో తిలకించడం జరిగినదనీ, ఆ సందర్భంలో నన్ను ప్రశంసించడం జరిగినదనే విషయం మిత్రుడైన తమిళనాడు పార్లమెంటు మాజీ సభ్యుడు ఒకరి ద్వారా జులై మాసంలో తెలిసింది.

ఆ మరుసటి రోజునేను, దూరదర్శన్ డైరెక్టర్ జనరల్‌గా ఉన్న శ్రీ కె.ఎస్. శర్మ (ఐఎఎస్)గారిని వారి కార్యాలయంలో కలుసుకున్నప్పుడు, రెడ్డిగారి గురించి ప్రస్తావించాను. దగ్గితే పేగులు లెక్కపెట్టగల సూక్ష్మగ్రాహియైన శర్మగారు నా

ఉద్దేశం పసికట్టారు. "చెన్నారెడ్డిగారు అపారఅనుభవంగల సీనియర్ రాజకీయ నాయకుడు. వారితో ఇంటర్వ్యూ చేసి, డాక్యుమెంటరీ ఎవరైనా నిర్మించగలిగితే నేను అభినందిస్తాను" అన్నాడు శ్రీ శర్మగారు. అందుకు నేను సంసిద్ధత వ్యక్తంచేశాను.

అడిగిన వారికి ఆలస్యం లేకుండా సహాయం చేసే స్వభావి, సరళ హృదయుడు, శ్రీ కె. సుబ్రహ్మణం శర్మగారు దూరదర్శన్ డి.జి. పదవీబాధ్యతలు స్వీకరించిన నాటినుండి డైరెక్టరేట్ జనరల్ కార్యాలయం పనివిధానంలో ఎంతో అభివృద్ధి జరిగిందని అందరూ చెబుతూ ఉంటారు. అంతే కాక, తెలుగు సంస్కృతి, తెలుగువారి వైభవం తెలుగు దేశ విశిష్టత చాటిచెప్పే ఎన్నో కార్యక్రమా లకు (హిందీ, ఇంగ్లీషు, భాషలలో) దూరదర్శన్ జాతీయ ప్రసారాలతో చోటు దొరికింది. నిర్మాతలలో కూడా ఎందరో తెలుగువారి పేర్లు కనిపిస్తున్నాయి. దూరదర్శన్ అంతకుముందు నిర్లక్ష్యంచేసిన, దేశంలోని మరికొన్ని ప్రాంతాలకు కూడా శ్రీ శర్మగారు ఇదే రకమైన గుర్తింపు ఇచ్చారు. ఈ నేపథ్యంలో నేను చెన్నారెడ్డిగారితో, తనపై ఫిల్మ్ గురించి సంప్రదించాలనుకున్నాను.

టెలెక్స్ ద్వారా ముందుగా వర్తమానం పంపించి అందులో సూచించిన సమయానికి నేను డాక్టర్ సాబ్‌తో టెలిఫోన్‌లో మాట్లాడటం జరిగింది. టెలివిజన్ డాక్యుమెంటరీ నిర్మాణానికి సహకరించేందుకు సూత్రప్రాయంగా అంగీకరిస్తూ 'ఒక రోజు నువ్వు మద్రాస్ ఎందుకు రాకూడదు. వివరంగా మాట్లాడుకోవచ్చు' అన్నారు డాక్టర్ సాబ్.

చెన్నారెడ్డి జీవిత చరిత్ర క్లుప్తంగా రూపొందించి దాని ఆధారంగా డాక్యుమెంటరీ నిర్మాణం జరుగగలదని చర్చించే ఉద్దేశ్యంతో కొంతభాగాన్ని రచించడం జరిగింది. 1996 ఆగస్టు రెండవ వారంలో ఈ రచయిత మద్రాస్

# మహానాయకుడు మర్రి చెన్నారెడ్డి

రాజభవనంలో డాక్టర్‌గారి అతిథిగా ఉన్న సందర్భంలో 1983లో పంజాబ్ గవర్నర్ పదవీ బాధ్యతలు వదిలే వరకు జరిగిన చరిత్ర (రచన పూర్తి అయిన) భాగాన్ని చదివి వినిపించడం జరిగింది. ఈ సందర్భంలో మాతోపాటు గవర్నర్ కార్యదర్శి శ్రీమతి శీలప్రియ ఐ.ఎ.ఎస్ కూడా ఓపికతో కూర్చున్నారు.

"ఇలా గంటల తరబడి కూర్చొని మీరు వ్రాసినది, వ్రాయబోయేది గురించి వింటే గవర్నర్‌గారికి అలసట కావచ్చు. అందువలన మీరు ఆడియో టేప్ చేసి పంపితే వారు టేప్‌రికార్డర్‌పై వింటారు. ఆతరువాత ఒకసారి, రెండుసార్లు కూర్చొని చర్చించుకొని ఇంటర్వ్యూ ఫిల్మ్ చేసుకోవచ్చు"అని శ్రీమతి శీలప్రియగారు సూచించారు.

మద్రాసు నుండి, నేను హైదరాబాద్‌కు తిరిగి వచ్చే సరికి డాక్టర్‌గారిపై టి.వి. డాక్యుమెంటరీ నిర్మించవలసినదిగా నన్ను కోరుతూ ఢిల్లీ నుండి లేఖ వచ్చింది. అంతేకాక, నాకు ఈ సందర్భంలో అవసరమైన సహాయం అందించ వలసిందిగా మద్రాస్, లక్నో, జయపూర్, ఛండీఘర్ హైదరాబాద్ మొదలైన డి.డి. కేంద్రాల డైరెక్టర్స్‌ను ఆదేశించినట్టు కూడా డైరెక్టరేట్ జనరల్ తో కంట్రోలర్ ఆఫ్ ప్రోగ్రా సి.పి. మాథుర్‌గారు నాకు తెలియజేశారు.

అనేక కారణాల వలన,నేను హైదరాబాద్‌లో ఎక్కువకాలం లేకపోవడం వలన సెప్టెంబర్, అక్టోబర్ మాసాలలో చెన్నారెడ్డి గారిపై డాక్యుమెంటరీ కార్యక్రమం చురుకుగా ముందుకు సాగలేదు. తండ్రి చెన్నారెడ్డిగారికి, అమెరికా వెళ్ళి కడుపు కోయించుకొని తన మూత్రపిండం సమర్పించి ప్రాణదానం చేసి జనకుడి ఋణం తీర్చుకున్న సాహసి, సజ్జనుడు మర్రి రవీందర్‌రెడ్డితో మాత్రం రెండు మూడుసార్లు చర్చలు జరిగాయి, సమాచారం కొరకు.

నవంబర్‌లో స్క్రిప్ట్ కొంతభాగం పూర్తిచేశాను. స్థానిక ఆడిటర్ మిత్రుడు

వివేక్ నరసింహంగారికి నేను రికార్డింగ్ బాధ్యత అప్పగించగా వారు తమ సతీమణి శ్రీమతి శ్వేత కళ్యాణితో రచనను చదివించి ఆడియో టేప్ చేశారు. నవంబర్ 21వ తేదీ సాయంత్రం రచయిత ఢిల్లీ వెళ్లడానికి కొద్ది నిమిషాల ముందు అందించడంతో చెన్నారెడ్డిగారికి చేర్చే ప్రయత్నం చేసే అవకాశం లేకపోయింది.

ఇతర పనులతోపాటు, డాక్టర్‌గారికి సంబంధించిన పూర్వపు వీడియో ఫిల్మ్‌క్లిప్స్ కొన్ని సంపాదించేపనిపైనేను ఢిల్లీలో వున్నాను. చెన్నారెడ్డిగారు స్వర్గస్తులైనారనే విషయం మిత్రులు ద్రోణంరాజు సత్యనారాయణగారు (ఎం.పి.) నాకు డిసెంబర్ 2వ తేదీన ఉదయం పార్లమెంటు సెంట్రల్ హాల్‌లో కలిసినప్పుడు బాదామయ శోకతప్త హృదయంతో తెలియజేయడంతో నేను హుటాహుటిన నగరానికి తిరిగివచ్చాను. ఆయన షష్ఠిపూర్తి ఉత్సవ సందర్భంలో 1979లో ప్రచురణ జరిగిన విశిష్ఠ సంచికలు మినహాయిస్తే డాక్టర్ గారి రాజకీయ షష్టిపూర్తి వరకు విశేషాలు వివరంగా తెలిపే సంపూర్ణ గ్రంథం ఏదీ లేదు. వారి అభిమానులకు ఇది పెద్ద కొరత. అందువలన డాక్యుమెంటరీ సంగతి పక్కన పెట్టి డిసెంబర్ ఆరు - తొమ్మిది తేదీల మధ్య ఈ చిన్న గ్రంధాన్ని పూర్తిచేయగా, టి.వి. ఛానల్స్ కో-ఆర్డినేటర్ శ్రీ ములుగు రాజేశ్వరరావు (మాగజైన్ నెట్‌వర్క్స్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్)గారు శరవేగంతో డిసెంబర్ 10వతేదీకీ ఫోటో టైప్‌సెట్టింగ్ పనిపూర్తిచేయించారు. నా విజ్ఞప్తికి తక్షణం ప్రతిస్పందించిన శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గ్రంథ పరిచయానికి ముంధుమాట వ్రాసేందుకు అంగీకరించారు.

పత్రికా రచయితగా 40 సంవత్సరాల సుదీర్ఘ జీవితంలో శ్రీ వెంకటేశ్వరరావుగారు దూరదర్శన్, రేడియో ప్రసారాలకు పుంఖానుపుంఖాలుగా వ్రాయడమే కాక ఆంధ్రప్రభ, ఈనాడు పత్రికలకు ఎడిటర్‌గా ఉదయం గ్రూప్

పత్రికల ఛీఫ్ ఎడిటర్‌గా పనిచేసిన ప్రజ్ఞాశాలి. వెంకటేశ్వరరావుగారికి చెన్నారెడ్డి గారితో చిరకాల సన్నిహిత పరిచయం ఉన్నది. డాక్టర్‌గారు అపారంగా ఆదరించి ప్రేమించి గౌరవించిన వ్యక్తుల్లో శ్రీ రావుగారు ఒకరు. అందువలన ఈ పుస్తకాన్ని పరిచయం చేసే అర్హత ఏ ఇతర ప్రముఖునికంటే శ్రీ వెంకటేశ్వరరావుగారికే ఎక్కువ ఉన్నట్టు నేను భావించాను. ఉదయం పత్రిక సంపాదకుడు శ్రీ కె. రామచంద్రమూర్తిగారితో డాక్టర్ సాబ్ గురించి ముచ్చటిస్తున్న సందర్భంలో ఆయనగారు నాకు పొత్తూరిగారి సహాయం కోరాలనే ప్రేరణ కల్పించారు.

వెంకటేశ్వరరావుగారు నిర్మోహమాటంగా అడిగిన ప్రశ్నకు ఒక సందర్భంలో చెన్నారెడ్డిగారు ముక్కుసూటిగా సమాధానం చెబుతూ నేను కర్నాటక ముఖ్యమంత్రి చందాలు స్వంతానికి వసూలు చేసుకోలేదు. ఆ ధనం వల్లనే శ్రీమతి గాంధీ, కాంగ్రెస్(ఐ)పార్టీ బట్టకట్టడం జరిగింది" అన్నారు నవ్వుతూ. ఈ ఉదాహరణ వారి సన్నిహితత్వాన్ని తెలియజేస్తుంది.

మహా పురుషుడైన మఱ్ఱి చెన్నారెడ్డిగారి రాజకీయ జీవితం, కొన్ని సందర్భాలలో ప్రశాంత ఝురీ వేగతుల్యంగానూ, మరికొన్ని సందర్భాలలో ఎగిసి ఘోషిస్తూ పరుగులు తొక్కిన తరంగాలవలె పయనం సాగించింది.

ఎంతమంది ఎన్ని గ్రంథాలు వ్రాసినా, ఆయన జీవిత చరిత్రలో అనుపమాన ఘట్టాలకు సంపూర్ణంగా అద్దం పట్టడం అసాధ్యం. నేనూ ఒక సమిధను సమకూర్చాననే సంతృప్తి మిగుల్చుకునేందుకు వారి జీవిత విశ్లేషణలు క్రోడీకరించి యువతరానికి తెలిపేందుకు ప్రయత్నం చేశాను.

ఈ పుస్తకంలో పొరపాట్లు ఏమైనా దొర్లి ఉంటే నా వ్యాఖ్యలు ఎమైనా, ఎవరికైనా అసంతృప్తికి కారణమైతే నన్ను దయతో క్షమించవలసిందిగా సవినయంగా మనవి చేస్తూ శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారికీ, శ్రీ ములుగు

రాజేశ్వరరావుగారికీ, సదా నన్ను ప్రోత్సహించిన పార్లమెంట్ సభ్యుడు డా॥ బి.ఎన్.రెడ్డిగారికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

*- ఆదిరాజు వెంకటేశ్వరరావు*



Dr. M. Channa Reddy with his family